# ముఖచిత్రం

సంప్రదాయం గోపికలను లౌకిక సుఖాలకు ప్రతీకలుగా గ్రహిస్తుంది. కృష్ణుడు రాధను విడచి, మరిచి, గోపికలతో రాసలీలలు జరుపుతాడు.

రాధ దేవుని వెతుక్కొనే మానవ ఆత్మ. అంతిమంగా ఆమెప్రేమ కృష్ణుని బందీ చేయగా, అతడు గోపికలను వదిలి, రాధను అన్వేషిస్తాడు. ఒక దూతిక కృష్ణుని చేరి, రాధ విరహబాధను నివేదించి, తిరిగి రాధను చేరి, ''కృష్ణుడు నీ కోసం ఆ తరుచ్ఛాయల్లో ఎదురుతెన్నులు చూస్తూన్నాడు,'' అని చెప్పింది.

పగడాల కంఠహారం, ముంజేతికంకణం, ముక్కు బులాకీల తో రాధ అలంకరించుకొని, కృష్ణుని సమాగమం కోసం తయారైంది. పుష్పించిన లతలు అల్లుకొన్న తమాల వృక్షాలక్రింద ఆమె కృష్ణుని కలిసింది. కృష్ణుడు తన నల్లని గొంగళిని నేల మీద పరిచాడు. అప్పుడా జంట దానిపై విశ్రమించింది. చకోర పక్షులు ఎదురుగా చెట్లపై కువకువ మంటున్నాయి. కలువలు, తామరాకులుతో గూడిన తటాకం అక్కడ ఉంది. 'నెమళ్ళు చెట్టు మీద, నేల మీద ఉన్నాయి. ఆకాశం నల్లని మేఘాలతో కప్పబడి ఉంది. నెమలి పింఛాల కిరీటాన్ని, శ్వేతమాలను కృష్ణుడు ధరించి ఉన్నాడు.

వర్షపు చినుకుల కోసం చకోర పక్షి ఎదురుచూపినట్లుగా రాధ అతనికేసి చూస్తుండగా, అతడేమో ఆమెకు జడవేస్తున్నాడు.

# మిసిమి

"All that we are is the product of what we have thought" is "We are what we think." — Dammapada.

సంపుటి 9 జులై 1997 సంచిక 6

వ్యవస్థాపక సంపాదకుడు : డాక్టర్ **రవీంద్రనాథ్ ఆలపాటి**

## విషయసూచిక



విడిప్రతి రూ. 6/- వార్షిక చందా రూ. 70/-

ముఖచిత్రం : రాధకు జడవేస్తున్న కృష్ణుడు - కాంగ్రా.

Printed, Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd., 1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7612436, 7612337.

సంపాదకుడు : **అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి**

# 'Dos & don'ts' for Asians in USA

The communication gap between south Asian professionals in the USA and their American colleagues has become a subject of serious study by cultural diversity experts.

Syed Zafar, president of the Cultural Diversity Group, has distilled some basic rules for south Asian professionals to help them adjust better to American culture at the workplace.

"Speak slowly, show emotions, smile, engage in small talk with support staff and ask for others' opinion", said Mr Zafar while addressing a group of Indian American engineers here.

Mr Zafar said it was necessary to understand the basic difference in American and Asian culture. Giving an example, he said, in India and Pakistan talking is considered an activity and the way the message is delivered can change the content. "Americans, on the other hand," he said, "take things literally. An Indian or Pakistani may say 'I will try' because he considers an outright refusal rude, but Americans do not not tolerate ambiguity.

Mr Zafar said he has often advised south Asian students at the Rice University workshops, "When you go to an American household and they say 'Let us eat', just jump in because the offer would not be repeated. Indian and Pakistani students, according to him, come from a culture where the host repeats the invitation five or six times to emphaisze that he or she actually means it.

Mr Zafar also said it was important to remember that Americans have a strong need for privacywhich goes along with their value for individualism. Quoting anthropologist Edward Hall, he stated that even at informal gatherings an average American would keep a physical arm's length from the person he was conversing with.

'Several engineers questioned him about the "imaginary space bubble that Americans have around them." One engineer said he found American informality deceptive. "The Americans I work with think nothing of talking about their wives and children to strangers." But what intrigued him was that"at a certain stage the informality stops and privacy takes over," he said. Indians and Pakistanis are more formal in the workplace, Mr Zafar said. "I have been often asked by colleagues, 'Why are you so sad? Is everything okay back home?' when I had my regular facial expression.

Mr Zafar stressed that Americans are "extremely conscious of time". In societies like India and Pakistan, time is "circular, it moves slowly, while in the USA it is linear," he said.

**- ASHOK EASWARAN in Houston**
***India Abroad News Service.***

# తృతీయప్రపంచాన్ని రక్షించండి

మూలం : నగ్వీబ్ మహ్ఫూజ్ సంక్షిప్తానువాదం : జి. బుచ్చయ్య

నోబెల్ ప్రసంగం, డిసెంబర్ 8, 1988

మాన్య సోదరులారా, సోదరీమణులారా,

ప్రథమంగా నా చిరకాల అవిశ్రాంత సాహితీ కృషిని గుర్తించిన స్వీడిష్ అకాడెమీకి, దాని అనుబంధ నోబెల్ కమిటీకి ధన్యవాదాలు అర్పించుకుంటూ, నా ఉపన్యాసాన్ని ఓర్పుగా స్వీకరించమని వేడుకుంటున్నాను. నేమాట్లాడే భాష మీలో ఎక్కువమందికి తెలియదు గనుక ఓర్పు అవసరమని నాభావన. ఈ అపరిచిత లక్షణం దీన్ని నిజమైన విజేతను చేసింది. కనుక దీని రాగఝురులు మీ సంస్కృతీ, నాగరకతా సరోవరం లోనికి ప్రవహించే అర్హత సంతరించుకున్నాయి. ఇది మా భాషా రచయితలకు చివరి అవకాశం కాదు, ఆనంద, జ్ఞానసౌరభాలతో మన బాధాతప్త ప్రపంచాన్నలరించిన అంతర్జాతీయ రచయితలతో మా సాహితీవేత్తలూ సగౌరవంగా, సాధికారంగా కలిసి కూర్చునే ఆనందం ముందు ముందు మా దేశానికీ లభిస్తుందని గొప్ప విశ్వాసం నాకు ఉంది.

కెయిరోలో వున్న ఓ విదేశీవార్తా ప్రతినిధి నాకు నోబెల్ లభించిందన్న వార్త తెలియగానే అందరూ నిశ్శబ్దంతో నిశ్చేష్టులయారనీ, అక్కడున్న వారిలో ఎక్కువమంది నేనెవరో తెలియక అయోమయంలో పడ్డారనీ నాకు చెప్పాడు. అందుకని, నేనెవర్నో సాధ్యమైనంత స్పష్టంగా మీకు తెలియబరచుకునే అవకాశానివ్వండి. నేనో రెండు నాగరకతలు సంతోషంగా ప్రసాదించిన బిడ్డను - అందులో ఒకటి ఏడువేల సంవత్సరాలదైతే, రెండోది పద్నాలుగు వందల సంవత్సరాలది. ఈ రెండూ జగద్విఖ్యాతాలు, వీటిని గురించి మీలాంటి ప్రాజ్ఞులకు నేను వేరే పరిచయం చేయనవసరం లేదు. కానీ, ఈ ప్రస్తుత సమావేశపరిస్థితిలో కొంచెం తిరిగి స్మరణకు తెచ్చుకుంటే నష్టమేమీ లేదుగదా!

ఈజిప్టు రాచరిక (ఫారోనిక్) నాగరకతలోని విజయాలను, సామ్రాజ్యాల నిర్మాణాన్ని గురించి నేనిప్పుడు మాట్లాడబోను. ఈ కళతప్పిన గొప్పతనాన్ని తలచుకుంటే ఆధునిక సభ్యప్రపంచపు అంతరాత్మ సంక్షుభిత మౌతుంది. ఈ నాగరకత ఏవిధంగా భగవంతుడి వైపుకి ఆలోచనను మళ్లించి, మానవ అంతరాత్మ ప్రభవానికి, వికాసానికీ దారితీసిందో దాన్ని గురించీ నేను మాట్లాడను. ఇది చాలా సుదీర్ఘమైన చరిత్ర. మీలో ఎవరికీ చక్రవర్తి - ప్రవక్తా అయిన అఖినేటన్ పరిచయంలేకుండా వుండదు. ఈ నాగరికతలోని సాహిత్యం, కళలు సాధించిన ఘనవిజయాల్ని గురించీ, జగద్విదితమైన అద్భుతా పిరమిడ్లు, స్ఫింక్స్, కర్నక్‌లను గురించి కూడా నేను ప్రస్తావించను, ఎందుకంటే వీటిని చూసే అవకాశం లంభించినవారు, వాటిని గురించి చదివి సమగ్రంగా ఆలోచించే వుంటారు.

అయితే ఇప్పుడు నేను కథకుడిగా మారటానికి దోహదంచేసిన, కథలా అనిపించే ఫారోనిక్ నాగరికతను పరిచయంచేయనీయండి. ఈ గ్రంథస్థమైన చారిత్రక సంఘటనని వినండి: ప్రాచీన పత్రాలు ఈజిప్టు చక్రవర్తి తన ఆస్థానంలోని కొంతమంది పురుషులకీ తన అంతఃపుర స్త్రీలకూ

---

★ జి. బుచ్చయ్య, గుంటూరు హిందూ కళాశాలలో ఆంగ్లోపన్యాసకులుగా పనిచేస్తున్నారు.

అక్రమసంబంధం వుందని తెలుసుకుంటాడు. తన కాల రివాజు ననుసరించి ఆ చక్రవర్తి వారిని మట్టుబెట్టవలసి వుంటుంది. కానీ దానికి విరుద్ధంగా తన రాజ్యంలో వున్న గొప్ప న్యాయవేత్తలని ఆ విషయంలోని బాగోగుల్ని విచారించడానికి నియామకం చేశాడు. తనకు సత్యం కావాలనీ, దానిననుసరించి న్యాయ బద్ధంగా శిక్ష విధించాలని తాననుకుంటున్నానని వారికి చెప్పాడు.

ఆ ఫారో కనబరచిన ఆ పద్ధతి ఒక మహాసామ్రాజ్యాన్ని స్థాపించటం కన్నా, పిరమిడ్లు నిర్మించటం కన్నా చాల గొప్ప విషయమని నా అభిప్రాయం. ఏ సంపదలు, వైభవం కన్నా ఆ నాగరికత ఎంతో మిన్న. అదిప్పుడు కేవలం గతించిన కథగా మిగిలిపోయింది. ఏదో ఒక రోజున పిరమిడ్లుకూడా గతించిపోతాయి. కానీ సత్యం, న్యాయం మానవజాతి స్ఫురణాశీలంతో, చైతన్యభరిత హృదయనేత్రంతో వున్నంతవరకు నిలిచివుంటాయి.

స్వేచ్ఛ, సమానత, క్షమ ఆధారంగా భగవంతుడి రక్షణతో మానవజాతిని మొత్తాన్ని సమైక్యం చేయాలని పిలుపునిచ్చిన అంశానికి సంబంధించిన ఇస్లామ్ నాగరికతను గురించి నేను మాట్లాడదలుచుకోలేదు. కాని ప్రవక్త మహత్త్వాన్ని గురించీ మాట్లాడను. మీ మతాలకు సంబధించిన తత్త్వవేత్తల్లో కొందరు ఆయన్ను చరిత్రలో మహోన్నత మానవుడిగా భావించేవాళ్లున్నారని నాకుతెలుసు. భారత, చైనా నుండి మొదలుకుని ఫ్రాన్సు సరిహద్దుల దాకా విస్తరించిన సువిశాల భూభాగాన్ని జయించి భగవదారాధనకు, భక్తికి, సత్కార్యాచ్చా ప్రేరణకొరకు అసంఖ్యాకమైన ప్రార్థనా మందిరాల్ని నిర్మించిన ఇస్లామ్ విజయాల్ని స్పృశించను . అంతకుముందుగానీ మానవజాతికిఅనుభూతంకాని సహనశీలాన్ని మతాలమధ్య ఇస్లామ్‌సాధించిన సౌభ్రాత్రాన్ని గురించి కూడా మాట్లాడను.

దానికి ప్రతిగా అత్యంత ప్రముఖమైన లక్షణాల్లో ఒకదాన్ని సంగ్రహంగా చూసే, మనసును కదిలించే, నాటకీయమైన పరిస్థితిని పేర్కొని ఆ నాగరికతను మీకు పరిచయంచేస్తాను: ఆ నాగరికత బైజాపై విజయాన్ని సాధించి, వశపరచుకున్న యుద్ధఖైదీల్నందర్నీ గ్రీకు వారసత్వ సంపదగా వస్తున్న తత్త్వశాస్త్రం, వైద్యం, గణితశాస్త్రం పుస్తకాలకు బదులుగా ఇచ్చింది. ఇది జ్ఞానసముపార్జనాకాంక్షకు ప్రబలసాక్ష్యం గాక మరేమిటి? - ఆజ్ఞానార్థి అచంచల దైవభక్తుడూ తాను కోరుకునేది తన మతానికి విరుద్ధమైన నాగరికతా ఫలమైనప్పటికీని.

మాన్య సోదరులారా, ఈ రెండు నాగరికతల ముద్దుబిడ్డను గావడం, వాటి స్తన్యంతో తేరడం, వాటి సాహిత్యం, కళలలో పెరగడం నా అదృష్టం. ఆ తరువాత వైవిధ్యభరితమైన, మనోహరమైన మీ సంస్కృతీ మకరందాన్ని తనివితీరా ఆస్వాదించాను. ఈ అన్ని ప్రేరణనుంచీ నా మనోద్వేగాల నుంచీ పదాలు నానుంచి బహిర్గతమయాయి. ఈ పదాలు శ్లాఘనీయమైన మీ అకాడెమీ ప్రశంసకు పాత్రమై నోబెల్ బహుమతిని నోచుకోవడం నా అదృష్టం. దీనికి నాతరఫున, ఆ రెండు నాగరికతలను స్థాపించి నిర్మించిన మహానుభావులైన కీర్తిశరీరుల తరఫున ధన్యవాదాలు.

నగ్విబ్‌మహ్‌ఫూజ్ 11 డిసెంబరు 1911లో కెయిరోలో జన్మించాడు. తండ్రి అబ్దుల్ అజీజ్ ఇబ్రహీమ్ మహ్‌ఫూజ్ వ్యాపారి. తల్లి ఫతీమా ముస్తాఫా మహ్‌ఫూజ్. కెయిరో విశ్వవిద్యాలయంలో తత్వశాస్త్రాన్ని అధ్యయనం చేసి, బి. ఎ. పట్టాన్ని పుచ్చుకొన్నాడు.

ఒక ప్రక్క యమ్. ఎ. ఫిలాసఫీ చదువుతూ, మరో ప్రక్క కథలు రాయడం మొదలుపెట్టాడు 1930లో. ఆరబ్ రచయితలైన తఫీక్ అల్ - హకీమ్, అల్ - అక్కాడ్, యాయ్యాహక్కీ ఇబ్రహీమ్, అల్ - మజినిలు, పాశ్చాత్య రచయితలు కాము (camus)కాఫ్కాలు ఈయన్ను ప్రభావితం చేశారు.

ఇతడు ముప్పై నవలలు, నూరుకు పై చిలుకు కథలు, రెండు వందల పైబడి వ్యాసాలు రాశాడు.

ఈయన రచనలు (1939-52 మధ్య) కెయిరో సామాజిక జీవన వాస్తవికతను చిత్రించాయి. ఆ తరవాత, అతని రచనలు (1952-57) సంప్రదాయ నగరజీవితాన్ని చిత్రించాయి. అతడు రాసిన Awaland Haratina (The children of our quarter) (1959) అతని పాత్రల మానసిక స్థితులను విశ్లేషించింది. మతం మీద విజ్ఞానం శాస్త్రం చేసే దాడిని బహిర్గతం చేసింది.

ఇస్లామ్ సమూల పరివర్తన వాదులు, ఇతడు ఇజ్రేల్‌తో శాంతిని కోరినందుకూ, సంప్రదాయాన్ని పాటించకుండ మత విషయాలను చర్చించినందుకూ, ఇతని పై దాడి చేసి, మెడమీద కత్తితో పొడిచారు.

> **''అతడి రచనలు సూక్ష్మాతి, సూక్ష్మ బేధాలను ప్రతిబింబిస్తాయి. ఒకప్పుడు వాటిల్లో వాస్తవికత స్పష్టంగా గోచరమవుతుంది. మరో అప్పుడు అవి సంధిగ్దతా భాసమానాలు. ఇటువంటి రచనల ద్వారా ఎవరు మానవాళి కంతటికీ అనుప్రయుక్తమయ్యే అరేబియన్ కథన కళను రూపొందించారో ఆయనకు.''**

సంపాదకుడు.

సోదరమహోదయులారా,

తృతీయ ప్రపంచపు ఈ మనిషికి కథలు రాయడానికి మానసిక ప్రశాంతి ఎలా లభించిందా అని చకితులౌతున్నారు గదూ? మీరాలోచించేది నిజమే. ఋణభారంతో మ్రగ్గిపోయి, ఆ ఋణాలు తీర్చే ప్రయత్నంలో తిండికి ఉండీ లేక దైన్యంతో కొట్టుమిట్టాడే ఆ ప్రపంచంనుంచే నేనొచ్చాను. ఆ ప్రపంచం అంతర్భాగాలైన ఆసియాదేశాల్లో కొందరు వరదల్లోనూ, ఆఫ్రికా దేశాల్లో కొందరు కరువుల్లోనూ సమసిపోతున్నారు. మానవహక్కుల యుగమైన మనకాలంలోనే దక్షిణాఫ్రికాలో లక్షలాదిమంది మనుషుల్లా బ్రతకడానికి నోచుకోక, మానవుడి కనీస హక్కులైనా లభించక, తోటి మానవుడు తిరస్కారానికి లోనై వ్యథననుభవిస్తున్నారు. వెస్ట్ బాంక్‌లో, గాజాలో,

తమ తండ్రుల, తాతల, వారి తాత తండ్రుల భూమిలోనే బహిష్కృతుల్లా బ్రతుకుతున్నారు. వాళ్లిప్పుడు సర్వప్రపంచం వారి జన్మభూమి అనిగుర్తించిన తమ భూమికోసం, ఆదిమమానవుడి కాలం నుంచీ వస్తున్న జన్మభూమి పై హక్కుకోసం ఉద్యమిస్తున్నారు. ఆ మహాశయం కోసం ధైర్యంగా ఉద్యమించిన వారికి, స్త్రీ, పురుష, శిశుయువక భేదం లేక ఎముకలు విరగ్గొట్టడం, తుపాకీగుండ్లతో చంపివేయడం, చెరసాలల్లో, ప్రత్యేక శిబిరాల్లో చిత్రహింసలు పెట్టడం బహుమతిగా అందిస్తున్నారు. ఈ అమానుషాన్ని చుట్టూవున్న 15కోట్ల అరబ్బులు కోపంతో, భేదంతో క్షుభితులైగమనిస్తూన్నారు. న్యాయమైన, సమగ్రమైన శాంతిని కాంక్షించే వారు దీనిని పట్టించుకుని కాపాడకపోతే, ఆప్రాంతం మహోత్పాతానికి గురౌతుంది.

ఇక, ఇలాంటి తృతీయ ప్రపంచాన్నుంచి వచ్చిన ఈ మనిషి ఎలా కథలు రాయగలిగాడూ అని. అదృష్టవశాత్తూ, కళ అమిత ఉదారమైందీ, సానుభూతి పూరిత మైందీను. ఆనంద పరిపూర్ణుల్లో ఏవిధంగానెలకొని వుంటుందో, దీనుల్నీ ఆవిధంగానే వదిలిపెట్టకుండా వుంటుంది. రెండువర్గాల వ్యక్తులకూ హృదయాంతరాళాల్నుంచి పెల్లుబికే అనుభూతుల్ని వ్యక్తీకరించే అనువును ప్రసాదిస్తుంది.

నాగరికతాచరిత్రలోని మన ఈ ప్రత్యేక సందర్భంలో మానవజాతి ఆర్తనాదాలు శూన్యంలో అంతరించడం మన ఊహించలేనిదీ, అంగీకరించలేనిదీను. నిస్సంశయంగా మనయుగపు మానవాళి పరిమితి చెందింది. మనయుగం ప్రపంచపు రెండు అత్యంతబలోపేతశక్తుల మధ్య సయోధ్య సాధ్యమని భావిస్తూంది. మానవమేధ ఇప్పుడు మన జాతి వినాశనానికీ, నిర్మూలనకీ దారితీసే అన్ని అనర్థహేతువుల్నీ తొలగించుకునే మహత్కార్యాన్ని చేపట్టింది. శాస్త్రవేత్తలు వాతావరణాన్ని పారిశ్రామిక కాలుష్యాన్ని ప్రక్షాళన చేసే కార్యక్రమాన్ని చేపడుతున్నట్లే, మేధావి వర్గం మనజాతిని నైతికకాలుష్యాన్నుంచి ప్రక్షాళనచేయడానికి శ్రమించాలి. నాగరికత పరిఢవిల్లేగొప్పదేశాలనాయకులు, వారి ఆర్థశాస్త్రవేత్తలు సంచలనాత్మకమైన పెనుమార్పును అందించి ప్రపంచం దృష్టిలో నిలవాలి.

ప్రాచీనకాలంలో ప్రతినాయకుడు మనదేశ శ్రేయస్సుకు మాత్రమే కృషిచేసేవాడు. మిగతా అన్ని దేశాలను తన శత్రువులుగానో, స్వలాభాన్నిపిండుకునే సాధనాలుగానూ భావించేవాడు. ఆధిపత్యం, వైయక్తిక ఆదర్శాలూ, విలువలూ వ్యర్థమయాయి; అనేక నీతిబాహ్యవిషయాలు ఆదరణకు నోచుకున్నాయి; లెక్కకు మించిన అమాయకులు, ధర్మమార్గవర్తనులు, అంతరించారు, మట్టుబెట్టబడ్డారు. అసత్యాలు, మోసం, కుట్ర, క్రౌర్యం కార్యదక్షతగా, గొప్పదనానికి నిదర్శనాలుగా రాజ్యమేలాయి. ఈరోజున ఇది మౌలికంగా మారవలసిన అవసరముంది. ఈరోజున ఒక నాగరిక నాయకుడి గొప్పదనాన్ని ఆయన విశ్వజనీన దృష్టి, సర్వ మానవాళిపట్ల ఆయన బాధ్యతలే ప్రాతిపదికగా ఎంచుకోవలసివుంది. సమృద్ధ దేశాలూ, దరిద్రదేశాలూ ఒకే కుటుంబం వారే. ఈ వసుధైక కుటుంబం పట్ల ప్రతి మనిషి బాధ్యత అతని జ్ఞానం, మేథా, నాగరికతల అంతరాల ననుసరించి వర్తిస్తుంది. తృతీయ ప్రపంచం తరపున ఇలా చెబితే నా పరిమితుల్ని నేనతిక్రమించినట్లు కాదని నేననుకుంటున్నాను: మా దైన్యానికి కేవలం ప్రేక్షకులుగా వుండకండి. మీ స్థాయి కనుగుణంగా తగిన ఉదాత్తమైన పాత్రను మీరు నిర్వహించవలసివుంది. ప్రపంచపు నాలుగు చెరగులలోని మానవుడేగాక, చెట్టూ జంతువూ ఏదైనా దుర్దశలో వుంటే సర్వశక్తివంతమైన స్థాయిలో వున్న

మీదే బాధ్యత. ఇక మాటలకు సమయంచెల్లింది. ఇది కార్యసాధనకు కటిబద్ధం కావలసిన సమయం, బందిపోటు సంస్కృతినీ, అపరిమిత వడ్డీ నాగరికతనూ అంతమొందించవలసిన సమయమిది. యావద్విశ్వానికి జవాబుదారీ వహించే నాయకుల కాలంలో వున్నాం మనం. దక్షిణాఫ్రికాలో బానిసత్వంలో మగ్గుతున్న వాళ్లని కాపాడండి. ఆఫ్రికాలో మెతుకులేక కృశించి నశిస్తున్న వాళ్లని కాపాడండి. పాలస్తీనీయుల్ని తూటాల్నుంచీ, చిత్రహింసల్నుంచీ కాపాడండి. ఇంతేగాక, ఇజ్రాయేలీయులు వాళ్ల మహాగొప్ప మతవారసత్వ సంపదను అపవిత్రం చేయకుండా కాపాడండి. ఋణగ్రస్త దేశాల్ని కఠోర ఆర్థికనియమాల్నుంచి కాపాడండి. కాలానుగుణంగా విజ్ఞానశాస్త్రానికి అంకితమైన వాళ్ల దృష్టిని, దానికంటే మానవాళిపట్ల వాళ్ల బాధ్యతను నెరవేర్చేట్లు మళ్లించమనండి.

మాన్య సోదరులారా,

మీ మనసు ప్రశాంతతను అలజడికి గురిచేసినందుకు క్షమాపణ వేడుకొంటున్నాను. ఇంతకంటే తృతీయప్రపంచం నుంచి వచ్చిన నానుంచి ఏం కోరుకోగలరు? ఏపాత్రైనా దానిలోవున్న వస్తు వర్ణాన్ని సంతరించుకుంటుంది గదా? అంతేకాక విజ్ఞానశాస్త్రం, సాహిత్యం మహోన్నత విలువలు ప్రోది కోసం ఈ సంస్థను నెలకొల్పిన వ్యవస్థాపకుడి నాగరికతానందనంలో వినా, దీన మానవాళి విలాపాలు ఎక్కడ ప్రతిఫలిస్తాయి? ధనసంస్కృతిలో నలిగిన వ్యధితులు క్షమిస్తారనే ఆశతో, మంచిని ఆదుకునేందుకు తన ఐశ్వర్యమంతా ధారపోసిన ఆయన ఆదర్శాన్ని నాగరికతా పరిపూర్ణులైన సమర్థులందరూ అనుకరించాలనీ, ఆయన ఒరవడిని అలవరుచుకోవాలనీ, ఆయన ఆశయాన్ని మనసులో సుప్రతిష్ఠం చేసుకోవాలనీ తృతీయ ప్రపంచానికి చెందిన వాళ్లమైన మేము అధికారికంగా అడుగుతాం.

గణ్యసోదరులారా,

ఎంత వ్యధాభరిత పరిస్థితులు మమ్మల్ని చుట్టుముట్టినప్పటికీ, నేను ఆశావాదానికే కట్టుబడి వుంటాను. తత్త్వవేత్త కాంట్‌లాగా మరోలోకంలో 'మంచి' తన విజయకేతనాన్ని ఎగురుకేస్తుందని నేను అనను. మంచి రోజూ విజయాన్ని సాధిస్తూనేవుంది. ఆలోచిస్తే, చెడు మంచికన్నా దుర్బలమైందేమో! మంచి విజయం సాధిస్తుందని చెప్పడానికి చెరపరాని సాక్ష్యం మన కళ్లముందే వుంది: మృగాలు, కీటకాలు, ప్రకృతి విలయతాండవాలు, భీతి, అహంకార హుంకారాల్నుంచి మానవజాతి నిలదొక్కుకుని సతత ప్రవర్ధమానం కావడం, మంచికి విజయం కాక మరేమిటి? అలాకాకుంటే జాతులుగా ఏర్పడటం, సృజనాత్మకత, నూతన విషయావిష్కారాలు, రోదసీ విజయాలు మానవహక్కుల ఉద్ఘాటన వెలుగు చూసేవికావు. చెడు నీతిబాహ్యమైన వదరుబోతు, మనిషికి సంతోషాన్నిచ్చే ధానికంటే బాధించేదే ఎక్కువగా జ్ఞాపకముంటుంది. మా మహాకవి అబుల్ 'అలా-అల్' మారి చెప్పేదాన్లో ఎంతో నిజముంది:

ఒకమరణఖేదం
జననమోదంకంటె
'వేయిరెట్లు గొప్పది

చివరగా ధన్యవాదాలు తిరిగి సమర్పించుకుంటూ, మీ క్షమాపణ కోరుకుంటున్నాను.

# బౌద్ధంలో భౌతికవాదం

- టి. రవిచంద్

ఫిబ్రవరి సంచికలో ''బౌద్ధంలో భౌతికవాదం కోసం విఫలాన్వేషణ'' అనే అశోక్ వ్యాసం చదివాను. "What is Buddhism?" అనే ప్రొఫెసర్ నరసు ఆంగ్ల గ్రంథాన్ని ఏటుకూరు బలరామమూర్తి అనువదించడంలో కొన్ని చోట్ల మూలానికి అనువాదానికి తేడాలు, అశోక్ సూచించినట్లు, ఉన్న మాటయథార్థం. అయితే ఈ తేడాలు బలరామమూర్తి కావాలని చేసినవి కావు. బలరామమూర్తి భౌతిక వాదే అయినా భౌతికాన్ని కావాలని అనువాదంలో చొప్పించాలని ప్రయత్నించలేదు. అలా ప్రయత్నించి ఉంటే, ప్రొఫెసర్ లక్ష్మీనరసు గురించి పీఠికలో సిల్వా చెప్పిన దానిని యథాతథంగా అనువాదం చేసి ఉండేవారుకాదు. "Though at times Prof Narasu developed alarmingly materialistic tendencies and attempted to interpret Buddhism from a purely materialistic point of view which attitude brought him in conflict with us and other Thervada Buddhists, neverthless he remained a good Buddhist to the last day of his life". (ఆంగ్ల మూలం ఇంట్రడక్షన్ పేజి VI)

కర్మ పునర్జన్మ బౌద్ధంలో ప్రధానాంశాలంటున్న అశోక్ వైదిక మత కర్మ పునర్జన్మలకు బౌద్ధంలోని కర్మపునర్జన్మలకు ఉన్నవ్యత్యాసాన్ని గమనించే ఉంటారనుకొంటాను. డా. అంబేద్కర్ తన Buddha and His Dhamma లో కర్మ పునర్జన్మ రెండు భావనల్ని వివరించటంకోసమని ప్రత్యేకంగా ఒక అధ్యాయమే కేటాయించారు. దానిపేరు How Similarities in Terminology Conceal Fundamental Difference (పారిభాషిక పదాల పోలికలు దాచిపెడుతున్న మౌలిక విభేదం). ఈ తేడాని గుర్తించకపోతే వైదిక మతంలోని కర్మ, పునర్జన్మలనే బుద్ధుడు మరో రూపంలో వివరించాడని అనుకోవడానికి ఆస్కారం ఉంది. మనంతెలుగులోకి అనువాదం చేసేటప్పుడు Rebirth, Transmigration of soul లను సమానార్థకాలుగా భావించి 'పునర్జన్మ' అనే రెండు ఆంగ్లపదాల్ని అనువాదం చేస్తున్నాం. వీటిమధ్య ఉన్న మౌలిక వ్యత్యాసం నూటికితొంబయిమంది పాఠకులకు తెలియదు. బౌద్ధంలో గాఢమయినపరిజ్ఞానం ఉందనుకొనే వారికి కూడా Rebirth అర్థంకాని బ్రహ్మ పదార్థంగానే మిగిలిపోయింది. బలరామమూర్తి కూడా ఈపదాన్ని అనువాదం చేసేటప్పుడు అటువంటి ఇబ్బంది ఎదుర్కొన్నట్లు నిపిస్తుంది. Rebirth ను పునర్జన్మగా అనువదించి, క్రింద పాద పీఠికలో వివరణ ఇస్తే బాగుండేది. Rebirth ను యథాతథంగా అనువాదం చేస్తే బౌద్ధం ఆత్మ శాశ్వత వాదాన్ని అంగీకరిస్తున్నట్లేనని పాఠకులు భావించటానికి ఆస్కారం ఉంది. అందువల్లే Rebirth అనే పారిభాషిక పదం వచ్చినప్పుడల్లా బలరామమూర్తి ఇబ్బంది పడినట్లు కనిపిస్తుంది. అలాగే కర్మసిద్ధాంతంకూడా. అంతేకాని ఈరెండు భావనలు ఆయనకు నచ్చవు కనుక వాటిని వీలైనంతవరకు అనువాదంలో రాకుండా జాగ్రత్త పడ్డారనుకోవటం పొరపాటు. బలరామమూర్తి తమ అనువాదంలో బౌద్ధం పునర్జన్మనే తిరస్కరించిందని చెప్పటానికి ప్రయత్నించారని అశోక్ భావించటం సరికాదు. అలా భావించే వారయితే బలరామమూర్తి గతంలో ఒకసారి ఇలా అనేవారు కారు : "To sum up, buddhistic Philosophy as propounded by Gautama in spite of the concepts of nirvana, rebirth and karma essentially a philosophy of eternal change. It was the school which raised the standard of revolt against the metaphysical thinking of upanishads" (బుద్ధిజం-మార్క్సిస్ట్ అప్రోచ్, పి.పి.హెచ్, న్యూఢిల్లీ, 1985,

---

★ టి. రవిచంద్ తత్వశాస్త్రంలో ముఖ్యంగా బౌద్ధంలో అత్యంతంగా కృషి సలిపిన మేధావి. గుంటూరులో ఉంటున్నారు.

పే.48). ప్రొఫెసర్ లక్ష్మీనరసు సైన్సులో టీచర్ కావటం వల్ల ఇటువంటి భావనల్ని ఆధునిక శాస్త్ర విశేషాల దృష్ట్యా వ్యాఖ్యానించటానికి ప్రయత్నించారు. ప్రొఫెసర్ లక్ష్మీ నరసు బౌద్ధాన్ని శాస్త్రీయదృష్టితోపాటు సామాజిక నేపథ్యంలో పరిశీలిచారు. అందువల్లే ఆయన వ్యాఖ్యానం చాలావరకు భౌతిక వాదులకు నచ్చుతుంది.

భారతీయ తత్వశాస్త్ర చరిత్ర చదివిన వారికి, పరిశీలించిన వారికి ఒక విలక్షణత స్పష్టంగా గోచరిస్తుంది. మనం ఏదేశ తత్వశాస్త్ర చరిత్ర పరిశీలించినా భావవాదం (Idealism), భౌతిక వాదం (Materialism) స్పష్టంగా కనిపిస్తాయి. కాని భారతదేశంలో అందుకు విరుద్ధంగా మరో ప్రధాన తాత్విక ధోరణి కనిపిస్తుంటుంది. అది ఆత్మ శాశ్వతత్వాన్ని నిరాకరించే అనాత్మ వాద సంప్రదాయం. తొలిదశలో భారతీయ తత్వశాస్త్రంలో మూడు ప్రధాన తాత్విక ధోరణుల ఉన్నట్టు గ్రహించవచ్చు. అంతిమంగా అనాత్మవాదం వాస్తవికవాద, భౌతికవాద, భావ వాద ధోరణులుగా చీలినా ఆదిలో అనాత్మ వాద సంప్రదాయం బలీయంగా ఉండేదని భారతీయ తత్వశాస్త్ర చరిత్ర రుజువుచేస్తుంది. తర్వాత కాలంలో అనాత్మవాదమయిన బౌద్ధంలో వివిధ తాత్విక శాఖలు ఏర్పడ్డాయి. అవి: 1. మాధ్యమక వాదం (నాగార్జునుడు) 2. సౌత్రాంతిక 3. వైభాషిక 4. యోగాచార విజ్ఞానవాదం. ఈనాలుగు శాఖలలో సౌత్రాంతిక, వైభాషికాలు వాస్తవికవాద, భౌతిక వాద సూత్రాల్ని ప్రతి పాదించాయి. ఈ రెండింటినీ కలపి సర్వాస్తి వాదమంటున్నారు. భౌతిక ప్రపంచవాస్తవికతను అంగీకరించటం, ఇంద్రియాలు మానవజ్ఞాన సాధనకు మూలమని సౌత్రాంతిక, వైభాషిక శాఖలు అంగీకరిస్తాయి. అందువల్లనే కొంతమంది బౌద్ధ పరిశోధకులు ఈ రెండు శాఖలను భౌతిక వాదశాఖలుగా పరిగణించారు. ఇలా వీటిని పరిగణించిన వారిలో మార్క్సిస్టులు, మార్క్సిస్టేతరులు కూడా ఉన్నారు. ఇది బౌద్ధంలో ఆసక్తికరమైన పరిణామం. ఒకే తాత్వికుడి దార్శనిక వ్యవస్థలో, తర్వాత కాలంలో భావవాద, భౌతిక వాద ధోరణులు ఏర్పడటం తత్వశాస్త్ర చరిత్రను అధ్యయనం చేసే వారికి విస్మయం కలిగిస్తుంది. బౌద్ధాన్ని కేవలం భావవాదం గానో, భౌతిక వాదం గానో పరిగణించేవారికి ఈపరిణామం ఆశ్చర్యం కలిగించవచ్చు. కాని బౌద్ధాన్ని నిష్పాక్షికంగా పరిశీలించిన వారికి ఈ పరిణామం సహజంగా కనిపిస్తుంది. బౌద్ధం గౌతమ బుద్ధుని మరణానంతరం రెండుమూడు వందల సంవత్సరాలకు ఒక సంక్లిష్టమైన తాత్విక వ్యవస్థగా రూపొందింది. బౌద్ధం పదార్థ ప్రాథమికత (Primacy) ని గుర్తించదు. కాబట్టి భౌతిక వాస్తవికతను నిరాకరించిందని నిర్ణయానికి రాకూడదు. పదార్థ ప్రాథమికతను అంగీకరించలేదు. కాబట్టి భావ (Idea) ప్రాధాన్యతను, ప్రాథమికతను అంగీకరించిందని భావించకూడదు. 'అసలు ఏవస్తువునూ బౌద్ధం ప్రాథమికమని అంగీకరించదు, అన్నీ ప్రవాహసదృశ్యాలే. ప్రతిదీ పుట్టుక, పెరుగుదల, నాశనం అనే క్రమంలో సాగే తరంగ శ్రేణి. ఈ భావం బౌద్ధానికి మూలం కావటంతో, ఏదో మార్పులేని శాశ్వత భావనను స్ఫురింపజేసే పదార్థ ప్రాథమిక తను కూడా బౌద్ధం నిరాకరిస్తుంది.'' అంతే కాని భావ ప్రాథమికతను ఆమోదించదు. ఆధునిక యుగంలో మార్క్సిజానికి ఎన్నోభాష్యాలు, భాష్య కారులున్నారు, బౌద్ధానికి కూడా అన్ని భాష్యాలు, భాష్యకారులు ఉన్నారనడంలో సందేహంలేదు. బౌద్ధం అద్భుతమైన తాత్విక, సామాజిక, ధార్మికవ్యవస్థ. అందువల్లనే ప్రొఫెసర్ హిరియన్న, టి. ఆర్.వి.మూర్తి లాంటి సాంప్రదాయిక పండితులుసైతం బౌద్ధాన్ని భావ వాదమనో, భౌతిక వాదమనో ఏదో ఒక తాత్విక ధోరణిగా పరిగణించటాన్ని అంగీకరించలేదు. టి. ఆర్.వి. మూర్తి, 'దిసెంట్రల్‌కన్సెప్షన్ ఆఫ్ బుద్ధిజం' అనే గ్రంథంలో బౌద్ధాన్ని గురించి ఇలా అన్నారు "Buddhism is a matrix of systems, and not one unitary system. It does not exclude legitimately different formulations". బౌద్ధం దర్శనాలకు గర్భాశయం లాంటిది. అది ఏకీయమయిన దార్శనిక వ్యవస్థ కాదు. అది తర్కసమ్మతమైన వివిధ సూత్రీకరణలను

బహిష్కరించదని టి. ఆర్.వి.మూర్తి లాంటి బౌద్ధ పండితులు అంగీకరిస్తున్న తర్వాత బౌద్ధంలో భౌతిక వాదం కోసం అన్వేషణ ఎలా విఫలాన్వేషణ కాగలదు? బౌద్ధంలో ఏ దార్శనిక ధోరణి ఒక్కొకప్పుడు పైచేయిగా ఉన్నా, సామాజికంగా బౌద్ధం ఎప్పుడూ ప్రగతిశీలమైన పాత్రనే నిర్వహించింది. బౌద్ధంలోని నిరీశ్వర వాదం, నాస్తిక వాదం, అనాత్మవాదం నిశ్చయంగా విప్లవాత్మక భావనలే. ఈ భావాలు చాలు తొలిబౌద్ధంలోనే భౌతిక వాద ఛాయలు ఉన్నాయనటానికి. భౌతికవాదమంటే కేవలం పదార్థ ప్రాథమికతను అంగీకరించేది మాత్రమే కాదు. దాన్ని ఇంకా విస్తృతార్థంలో తీసుకోవాలి. ఒక్క బౌద్ధంలోనే కాదు, వేదాల్లో భౌతిక వాదాన్ని, భగవద్గీతలో భౌతికవాద అంశాల్ని చూపించిన పండితులుకూడా ఉన్నారు. ఆవ్యాఖ్యానాల్ని అంగీకరించవచ్చు. అంగీకరించకపోవచ్చు. కాని అటువంటి వ్యాఖ్యానాలు తర్కసమ్మతం, న్యాయసమ్మతమా కాదా అనే మనం ఆలోచించాలి.

బౌద్ధం భౌతికవాదులకు 'మరీచిక' లాంటిదయితే, అనాత్మ వాదులకు కూడా 'మరీచిక' లాంటిదనే అనాల్సివస్తుంది. బౌద్ధం అనాత్మ సిద్ధాంతమనే అశోక్ గట్టిగా భావిస్తున్నాడు. కాని బౌద్ధంలో బుద్ధుడు మరణించినరెండు వందల సంవత్సరాలకు వాత్సీపుత్రుడు అనే బ్రాహ్మణుడు పుద్గల వాదమనే ఒక బౌద్ధశాఖను క్రీ.పూ.3వ శతాబ్దంలో స్థాపించాడు. ఈ శాఖనే వాత్సీపుత్రీయులు అనికూడా అంటారు. వాత్సీపుత్రీయులు ప్రతి వ్యక్తి యందు 'శాశ్వతమగు పుద్గలం' కలదన్నారు. పుద్గలం లేనిదే పునర్జన్మ కుదరదు. పంచస్కంధములలో ఒక సూక్ష్మ స్కంధం ఒక జన్మ నుంచి మరొక జన్మకు సంక్రమిస్తుందనీ, ఇదే పుద్గలమని వీరిభావం. ఆత్మ భావనకు సన్నిహితమయిన శాశ్వతమయిన పుద్గలాన్ని అంగీకరించటంద్వారా బౌద్ధం ఆత్మవాదానికి సన్నిహితమయింది. మరి అటువంటప్పుడు బౌద్ధాన్ని ఖచ్చితంగా అనాత్మ వాదమనగలమా? అనలేమని పాలీభాషలో, బౌద్ధసాహిత్యంలో గొప్ప పండితురాలయిన శ్రీమతి రైస్‌డేవిడ్స్ అన్నది. ఆమె, ఆమెభర్త రైస్ డేవిడ్స్‌లు పాళీ సాహిత్యంలో అపారమయిన కృషిచేశారు. వారిపాండిత్యాన్ని ప్రశ్నించటం అంత తేలికకాదు. అటువంటి వ్యక్తి శ్రీమతి రైస్ డేవిడ్స్ బుద్ధుడు ఆత్మను అంగీకరించాడని 1. గౌతమ దిమ్యాన్ (1928) 2. శాక్య ఆర్ బుద్దిస్ట్ ఆరిజిన్స్ (1931) 3. ఏ మాన్యువల్ ఆఫ్ బుద్ధిజం (1932) లాంటి గ్రంథాల్లో ప్రకటించింది. బుద్ధుని బోధనలకు వ్యతిరేకమైన భాష్యం చెప్పింది. అప్పుడు ఆమె భావాల్ని ఖండిస్తూ మహాపండిట్ రాహుల్ సాంకృత్యాయన్ ఒక వ్యాసం రాశారు. తర్వాత అనేక మంది బౌద్ధ పండితులు ఆమె భావాల్ని ఖండించారు. శ్రీమతి రైస్ డేవిడ్స్ లాంటి ఆధునిక పండితుల భాష్యాల్ని ఎంతమంది ఖండించినా బౌద్ధశాఖల్లోనే ఒక శాఖ పుద్గల వాదం. అది ఆత్మవాదానికి సన్నిహితమయిందనే చారిత్రకవాస్తవాన్ని విస్మరించరాదు. నలినాక్షదత్ లాంటి బౌద్ధపండితులు పుద్గల వాదాన్ని 'ఆత్మకసిద్ధాంతం' అనికూడా పేర్కొన్నారు. ఈ శాఖకు చెందిన బౌద్ధ బిక్షువులు క్రీ.శ.7వ శతాబ్దంలో లక్షకుపైగా ఉండేవారని హ్యుయాన్ త్సాంగ్ రచనల వల్ల తెలుస్తుంది. ఇతర బౌద్ధశాఖలకు చెందిన బౌద్ధ భిక్షువులకంటే ఈశాఖకు చెందిన వారే ఎక్కువగా ఉండటాన్ని బట్టి క్రీ.శ. ఏడవ శతాబ్దంలో ఆత్మక సిద్ధాంతానికి ప్రజల్లో ఎంత ఆదరణ ఉందో అర్ధమౌతుంది. మరి అటువంటప్పుడు అనాత్మ వాదులకు కూడా బౌద్ధం మరీచిక లాంటిది కాదా? కాని బుద్ధుడు ఆత్మవాదాన్ని నిర్ద్వంద్వంగా ఖండించాడు అనేది చారిత్రక సత్యం. అదేవిధంగా బౌద్ధంలో భౌతిక వాద ఛాయలుతో పాటు భౌతిక వాదాన్ని ప్రబోధించిన తాత్విక శాఖలున్నాయనేది నిర్వివాదం. భౌతిక వాదులకు కావల్సినంత తాత్విక వానసత్వం ఈ దేశ చరిత్రలో లభిస్తుంది. అందువల్ల బౌద్ధంలో భౌతిక వాదం కోసం మేము అన్వేషించాల్సిన పనిలేదు. బౌద్ధంలో లేని భౌతికవాద ఛాయలు కోసం భౌతిక వాదులు అన్వేషించటంలేదు. దానిలో భౌతిక వాద ఛాయలేకాదు, భౌతిక వాద శాఖలే ఉన్నాయని దేశ,

విదేశీ పండితులు నిరూపించారు. అటువంటి వారిలో రష్యన్ బౌద్ధపండితుడు షెర్ బట్స్కీ, భారతీయ పండితుడు దేవీ ప్రసాద్ చటోపాధ్యాయ లాంటివారు ముఖ్యులు.

బౌద్ధంలో భౌతిక వాదమంటే గుర్తుకు వచ్చే మొట్టమొదటి తాత్విక శాఖ - వైభాషిక వాదం. ఇది థేరవాదానికి చెందిన సర్వాస్తి వాదంలో ప్రాచీన శాఖ. కాత్యాయనీ పుత్రుని 'జ్ఞాన ప్రస్థానం' సర్వాస్తి వాదుల ముఖ్యగ్రంథం. దీనిపై 'మహావిభాష' అనే భాష్యం ఉంది. ఈ మహావిభాష వైభాషికుల ప్రామాణిక గ్రంథం. ఈ భాష్యం సారాంశాన్ని వసుబంధుడు 'అభిధర్మకోశం' అనే తన తాత్విక గ్రంథంలో ఇచ్చాడు (చూడు: సెంట్రల్ కన్సెప్షన్ ఆఫ్ బుద్ధిజం, షెర్ బట్స్కీ, ఎపెండిక్స్ I, పేజీలు 76-91, మోతీలాల్ బనార్సిదాస్, న్యూఢిల్లీ, 1983). అశ్వఘోషుడు మహాయానశాఖకు చెందిన వాడని చాలామంది పండితుల అభిప్రాయం. కాని మహా పండిట్ రాహుల్‌సాంకృత్యాయన్‌తన 'భారతీయ దర్శనం'లో అశ్వఘోషుడ్ని సర్వాస్తి వాదిగా పేర్కొన్నాడు. (భారతీయ దర్శనం, అనువాదం: ఆలూరి, గుడివాడ, 1986). శుభగుప్తుడు సర్వాస్తివాద - వైభాషిక శాఖకు చెందిన ప్రధానాచార్యుడు. ఆయన రచించిన తాత్విక గ్రంథం - బాహ్యార్థసిద్ధి. ( ఇది 190 శ్లోకాల గ్రంథం). ఈయన బాహ్య ప్రపంచవాస్తవికతను అంగీకరిస్తాడు. దాని నిరూపణేఈ గ్రంథం. పుస్తకంపేరు చూస్తేనే తెలుస్తుంది శుభగుప్తుడు బాహ్యప్రపంచవాస్తవికతను నిరూపించటానికే దీన్ని రచించాడని. ఈయన క్రీ.శ.650-700 ప్రాంతంలో జీవించాడని మృణాలికాంతిగంగోపాధ్యాయ 'ఇండియన్‌ఆటమిజమ్' అనే గ్రంథంలో భావించారు. వసుబంధు దిజ్ఞానడు అణువాదంపై చేసిన దాడిని శుభగుప్తుడు ఎదుర్కొన్నాడు. శాంతిరక్షితుడు 'తత్వ సంగ్రహం'లో శుభగుప్తుడ్ని మరల విమర్శించాడు.

శుభ గుప్తుడి ఒకే ఒక లక్ష్యం భావవాదాన్ని నిరాకరించటం. ఆనిరాకరణ తర్క సమ్మతంగా బాహ్యార్థసిద్ధిలో చేశాడు. అందువల్లే ఈ గ్రంథం మృణాలికాంతి గంగోపాధ్యాయ, దేవీ ప్రసాద్ చటోపాధ్యాయ లాంటి వారిని ప్రత్యేకంగా ఆకర్షించింది. బౌద్ధంలో భావవాద శాఖ అయిన విజ్ఞానావాదాన్ని సహేతుకంగా తిరస్కరించటమే బాహ్యార్థ సిద్ధిలో శుభగుప్తుడు చేసింది. విజ్ఞాన వాదులు అణువాదాన్ని తిరస్కరిస్తుంటే శుభగుప్తుడు బాహ్యప్రపంచం భౌతికంగా వాస్తవమయినదిగాగుర్తించి. అది అణునిర్మితమయిందనిసమర్థిస్తాడు. విజ్ఞానవాదాన్ని విమర్శించి, బాహ్య ప్రపంచం యొక్క భౌతికతనుగుర్తించటం ద్వారా ఆయన భౌతికవాదానికి అతిసన్నిహితంగా వచ్చినా, ఆయన్ని కేవలం భౌతిక వాదిగా పరిగణించలేము. ఆయన మతరీత్యా బౌద్ధుడు. ఆయన లౌకిక వాద భౌతికదార్శనికుడు కాడు. అయితే ఆయన మత దృక్పథం మహాయానం లాంటి మూఢవిశ్వాసాలతో కూడినది కాదు. బుద్ధుడికి సర్వజ్ఞత్వాన్ని ఆపాదించినా శుభగుప్తుడి దార్శనిక భావాలు భౌతిక వాదులకు అతి సన్నిహితమయినవి. బౌద్ధంలోని భావవాదులకు భిన్నంగానే ఆయన నిర్వాణాన్ని కూడా వ్యాఖ్యానించాడు. అందువల్లే షెర్ బట్స్కీ లాంటి పండితుడు వైభాషికుల దృష్టి ఆధునిక విజ్ఞాన శాస్త్రం యొక్క భౌతిక వాదాన్ని పోలి ఉందంటాడు "The Vaibhasika out look resembles the materialism of modern science". ఐతే ఈ అభిప్రాయంలో చటోపాధ్యాయ పూర్తిగా ఏకీభవించలేదనుకోండి. మార్క్సిస్టుగా చటోపాధ్యా శుభగుప్తుడి భౌతికవాద చింతనలోని మతవాసనల్ని పరిమితుల్నికూడాగుర్తించాడు. మార్క్సిస్టు కాని షెర్ బట్స్కీ వైభాషిక దృక్పథం ఆధునిక భౌతిక వాదాన్ని పోలి ఉందని చెప్పాడు. అందువల్ల భౌతిక వాదులేకాదు; భౌతిక వాదులు కాని నిష్పాక్షిక బౌద్ధపరిశోధకులు బౌద్ధంలో భౌతిక వాద ఛాయలు గురించి రాశారు. బౌద్ధంలో లేని భౌతిక వాదాన్ని దానిలో చూపించాలని భౌతిక వాదులు కాని గతితార్కిక భౌతిక వాదులు కాని తాపత్రయ పడాల్సిన అవసరం లేదు. బౌద్ధంలో ఉన్నదాన్ని ఉన్నట్టు చూపించటమే ఇప్పటివరకు భౌతికవాదులు చేసినపని. ఏమైనా బలరామమూర్తి అనువాదంలోని కొన్ని పొరపాట్లను ఎత్తి చూపిన అశోక్‌కు కృతజ్ఞతలు తెలియచేస్తున్నాము.

కొత్తవెలుతురు

# అనల్పవిషయాల అధి దేవత అరుంధతిరాయ్

- అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి

అనల్ప విషయాల అధి దేవత అరుంధతిరాయ్ అల్పవిషయాల దేవుడు (The God of small Things) అనే నవలరాసి అమ్మకాల విషయంలో సంచలనం సృష్టించింది. విక్రమ్‌సేత్ ఇలాగే లోగడ The Suitable Boy రాసి తుఫాన్ సృష్టించాడు. ఈ కోవలోనే శోబాడే "The Surviving Men" అనే నవలతో తానేమిటో రుజువు చేసుకొంది. ఈ నవలలను ప్రచురణకర్తలు ప్రచురించక ముందే ఆయా రచయితలకు కోట్లాది రూపాయలు రాయల్టీ ప్రకటిస్తున్నారు. అసలు ఆ నవల భావిలో ఎలా అమ్ముడవుతుందో, ప్రచురితమయిన తరవాత, పాఠకుడు దానికి ఎలా ప్రతిస్పందిస్తాడో, తెలియకముందే ధనం రాసులను ప్రచురణ కర్తలు రచయితలపై కురిపిస్తున్నారు. బహుశా వాళ్ళనమ్మకం, తమచేతిలో ఉన్న ప్రసార, ప్రచారసాధనాలతో ఏమైన చేయవచ్చు ననుకొంటున్నారు. అదే వాళ్ళ భరోసా. అడ్వర్టైజ్‌మెంట్ టెక్‌నిక్స్‌తో, సబ్బులను, టూత్‌పేస్ట్‌లను అమ్మినట్లు అమ్మవచ్చు ననుకొంటున్నారు. నిజంగా అలాగే ఈ రోజుల్లో జరుగుతోంది గూడ. The Suitable Boy అమ్ముడైతే పోయింది. ప్రచురణకర్తకు డబ్బులైతే వచ్చాయి, కాని ఆ నవలను (1300 పుటలు. ఎవరైనా పూర్తిగా చదివారా? అనేది సందేహం, మిత్రులు సాహితీ విమర్శకులే; ఆంగ్లభాషోపన్యాసకులే 25 పేజీలు దాటి చదవలేకపోయామని చెప్పారు. మరి ఆపుస్తకం మరో రెండు సంవత్సరాలు తరవాత జీవించి ఉంటుందా అంటే సందేహమే. ఏమైనా 'అమ్మడం' అనేది ఒక కళ. ఆ కళ పుస్తకాల అమ్మకానికీ ప్రాకింది.

ఈ కళ ఒకప్పుడు లేదు. శ్రీ పాదసుబ్రహ్మణ్యశాస్త్రి, మొక్కపాటి నరసింహమూర్తులు తమ పుస్తకాలను తామే కూరగాయల తట్టలపై పెట్టుకొని అమ్ముకొన్నట్లు అమ్ముకొని జీవించ వలసివచ్చింది. శ్రీపాద పేదవానిగానే మరణించాడు. ''బారిస్టరు పార్వతీశాన్ని'' రైలులో తిరుగుతూ మొక్కపాటివారు అమ్ముకొన్నట్లు చెప్పుకొంటారు. వారు కలకాలం జీవించి ఉంటారు. వారి పుస్తకాలూ అంతే. మరి విక్రమ్‌సేత్ విస్మృత పథంలోకి అప్పుడే జారుకొంటున్నాడు. మరి రాయ్ మాత్రం ఎన్నాళ్ళు?

అరుంధతిరాయ్ కంప్యూటర్ నేర్చుకొంటుండగా Word Processing ప్రక్రియలో ఏదో వింత గోచరించింది. ఎక్కడెక్కడివో ఏవో పదాలు యాధృచ్ఛికంగా కలిసాయి. అవి వాక్యాలయ్యాయి. ఏదో ఇతి వృత్తం అవగతమైంది. అంతకు ముందు చిన్న కథగూడ రాయని రాయ్‌కి కీబోర్డునుంచి ఒక నవలకు నవలే నిష్పన్నమైంది. అదేదో పొగవచ్చినట్లుగా అలా అలా వచ్చేసింది. '' అది నన్ను ఆవరించింది, ఆవహించింది. నన్ను చుట్టేసింది, పట్టేసింది. ముట్టడించింది. తప్పించుకో లేక పోయాను,'' అని ఆమె ఆ తరవాత చెప్పింది. ఫలితంగా ''అల్పవిషయాల దేవుడు'' ఆవిర్భవించింది. అది ఏప్రిల్ మొదటివారంలోనే మన దేశంలో, ఆమె మాతృభూమిలో విడుదలఅయింది. వచ్చే ఆరుమాసాలలో ఆది 19 దేశాలలో 16 భాషలలో విడుదలఅవుతుంది. ఇప్పటికి వచ్చిన అడ్వాన్సులు మిలియన్ అమెరికన్‌డాలర్లు.

తనకెప్పుడూ వాక్యాలను తిరిగిరాసే అలవాటు లేదంది. అలా చేయడమంటే ''పీల్చిన

గాలినే మళ్ళీ పీల్చడం'' లాంటిది అంది. అయితే వాక్యాలను చాల నిదానంగా రాస్తుంది. నవల పూర్తిఅవడానికి నాలుగున్నర సంవత్సరాలు పట్టింది.

ఆమెనటి, వాస్తుశిల్పి. వయస్సు 37 సంవత్సరాలు. పరాయి దేశాల ప్రచురణకర్తల నుంచి తన నవలకు వచ్చిన ప్రతి స్పందనకు ఆమె ఆశ్చర్యచకిత అయింది. బ్రిటీషు హార్పర్‌కాలిన్స్ వారు 250,000 డాలర్లు, అమెరికన్ రాండమ్‌హౌస్‌వారు 160,000 డాలర్లు అడ్వాన్సు చెల్లించారు. ఇటీవల వరకు, ఆమె ఎవరికీ ఇంటర్వ్యూలు ఇవ్వలేదు.

ఈ నవల ప్రచారం పొందిన తీరు మనకు ఆశ్చర్యం గొలుపుతుంది. 1996లో పూర్తిచేసిన ఈ నవలను, న్యూ ఢిల్లీలో పనిచేసే ఒక విదేశీ ప్రచురణకర్త ఏజెంట్‌కు, చదవమని ఇచ్చింది. ఆయన దీనిని రైలు ప్రయాణంలో చదవడం మొదలు పెట్టాడు. మధ్యలో అతడు ఉండబట్టలేక, ఒక మారుమూల స్టేషన్ నుంచి రాయ్‌కు ఫోన్‌చేసి, '' మీనవల ఎంతో గొప్పగా ఉంది'' అని చెప్పాడు. ఫలితంగా ఈ నవల గాడ్విన్ దృష్టిలో పడింది. ఇతడి ప్రతి స్పందన ఇంకా అద్భుతంగా ఉంది. అతడు ఢిల్లీకి హుటాహుటిన విమానంలోవచ్చి, రచయిత్రి వాకిట వాలాడు. అతడు ఆ నవలను ఎనిమిది మంది ప్రచురణకర్తలకు వేలం వేశాడు. ఇది చాల అద్భుతమైన విషయం. ఎందుకంటే అప్పటివరకు ఆమె ఒక అనామకురాలు. ఎవరికీ తెలియదు. విశేషం ఏమిటంటే, '' ఆ పుస్తకం చదివినవాని చుట్టూ అది ఒకగూడు అల్లుతుంది. దాని నుంచి అతడు తప్పించుకోలేడు.'' ఆ గూడు అనన్యమైంది. వర్ణనా తీతం. రాండమ్ హౌస్ వాళ్ళు ఆ నవల జాకెట్ మీద చిన్న అడ్వర్టైజ్‌మెంట్ రాయడానికి తన్నుకోవలసివచ్చింది.

వాస్తవానికి ఇతివృత్తం చాల చిన్నదే. తేలికగా చెప్పవచ్చు. కథ కేరళ రాష్ట్రంలో ఒక చిన్న నగరంలో 1969లో జరుగుతుంది. ముఖ్యపాత్ర అమ్ము. భ్రాత్రీయ కవలలకు తల్లి. వీరి వయస్సు ఏడుసంవత్సరాలు. విడాకులు తీసుకొంది. బ్రిటన్ నుంచి బంధువులు వస్తారు. ఈ సమయంలోనే ఆమె నిషిద్ధప్రేమ బంధాలలోకి జారిపోయి ఉంటుంది. ఆ వచ్చిన వారిలో ఒకడు మరణిస్తాడు. అమ్ము (గ్రంథం కథ) విషాదాంతమవుతుంది. అందులో సుడులు తిరిగిన నదుల, కాలం కాని కాలంలో కురిసే వర్షాల వర్ణనలు, సిరియన్ క్రిస్టియన్ల జీవితాల్లోకి అవలోకనం, పెద్దపెద్ద సామాజిక సమస్యలు - కులాలు, స్త్రీల దుర్భరత, కమ్యూనిస్టు రాజకీయాలు - అన్నీ అందులో చోటుచేసుకొన్నాయి. అల్పవిషయాల దేవుడు అంతిమంగాగెలుస్తాడు. అల్ప విషయాల దేవుడు ఎవరంటేసంప్రదాయం, ఆచారవ్యవహారాలు. ఇవిగెలుస్తాయి. ప్రేమ దేవత ఓడిపోతుంది. సంప్రదాయాల కబంధహస్తం ప్రేమను అణచివేస్తుంది.

ఈ కథ మొత్తం రెండు వారాలలో జరుగుతుంది. ప్రధాన ఘట్టం మాత్రం ఒకే ఒకరాత్రి జరుగుతుంది. ఇది విమర్శించదగిన విషయం ఏమీకాదు. ఆ మాటకొస్తే జేమ్స్ జాయిస్ రాసిన యులిసిస్ అనే 800 పుటల నవల కథ అంతా 24 గంటలలో జరుగుతుంది. ఈ నవల 340 పేజీలు. కథలో ఎక్కువభాగం చివరి 80 పేజీలలోనే నడుస్తుంది.

ప్రతిదృశ్యాన్ని ఆమె '' ఆగామిశోకా'' నికి సంకేతంగా వర్ణించింది. పతాకసన్నివేశం జరిగిన పరిత్యక్త ఎస్టేట్ గూడ అలాగే ఆగామిక్లేశాన్ని సూచించింది. '' అమ్ము నివసించే గది గోడలు అనతికాంలోనే వారి హృదయ విదారక అనుభవాలను గురించి తెలుసుకొంటాయి,'' ''అమ్ము ముఖం మీద తొణికిసలాడే నిద్రా దరహాసం ఎవరి కంట పడకుండ తప్పించుకోలేదు.'' '' ఆ చిరుదరహాసానికి చెందిన వ్యక్తి పేలిపోవడానికి సిద్ధంగా ఉన్న 'బాంబు' అని ఆ చిరునవ్వు ఏ రకం సూచన చేయలేదు.''

అమ్ము కథ రాయ్ అమ్మకథే. అమ్ముకర్మే రాయ్ అమ్మమేరీకి పట్టింది. మేరీ హిందూని ప్రేమించిపెళ్ళిచేసుకొంది. ఈ పెళ్ళిని మేరీ తల్లిదండ్రులు ఆమోదించలేదు. తరవాత విడాకులను గూడ వాళ్ళెవరూ క్షమించ లేకపోయారు. మేరీ, అమ్ము మార్గంలోకాక, స్త్రీలకు అక్కడ లేని వారసత్వపు హక్కుల కోసం పోరాడింది. ఇటు వంటి మెరమెరల మధ్య రాయ్, ఆమె సోదరుడు పెరిగారు.

రాయ్ వాస్తుశిల్ప శిక్షణకు కేరళ వదిలి ఢిల్లీ వచ్చింది. మురికి వాడలో రేకులషెడ్డులో నివసించింది. వాస్తువృత్తి వదిలివేసి గోవా బీచ్‌లో రొట్టె అమ్మింది. సినిమాలో నటించింది. తరవాత సినీస్క్రీన్‌ప్లే రాసింది.

ఏది ఏమైనా ఈ నవలలో భారతదేశాన్ని మహామూర్ఖంగా, కర్కశంగా, పాశవికంగా వర్ణించింది. ''భారతదేశంలో, నిరాశ తప్ప ఆశకు చోటు లేదు. రోడ్లు మురికి మురికిగా ఉంటాయి. కుళ్ళిన, నలగతొక్కబడిన జంతుకళేబరాలు, గృహాలు శిధిలాలు.''

''ఇదే నా చివరి రచన కావచ్చు. రచయిత్రి అయిన కారణాన మాత్రమే రాయాలనడంలో నాకు విశ్వాసం లేదు. రాతను వృత్తిగా పెట్టుకోవడంలో అసలు నాకు నమ్మకమే లేదు.''

## PENALTY FOR GENDER CHANGE

A man who underwent a sex change and now works as a belly dancer was sentenced to a month in prison yesterday for performing in an indecent costume and making lewd gestures, reports AP.

The dancer, known only as Sally, is well-known in Egypt. She was a former medical student at Egypt's conservative Al-Azhar University, but was expelled following her operation in 1989. She sued the university but lost, prompting a debate in Egyptian newspaper over the ethics of sex-change operations.

Her costume was not disclosed yesterday, but judge, Mr Mohamed Hegazi said it was part of an act that included "vulgar, sexually arousing movements" during an appearance at a seedy downtown nightclub.

Belly dancers, some of whom earn the equivalent of hundreds of thousands of dollars a year, are a fixture of the Cairo nightlife.

Sally, 36, had pleaded innocent to the charges.

# దిగంబర చిత్రం వేమనగారిదేనా?!

– డా॥ ఆరుద్ర

ప్రస్తుతం ఒక దిగంబరయోగి చిత్రం వేమనగారి రూపచిత్రంగా బహుళ ప్రచారంలో వుంది. బొమ్మను చూడగానే ఇది వేమనగారిది అని అందరూ ఇట్టే గుర్తుపట్టేటంతగా ఇది ప్రసిద్ధమైంది. అయితే ఈ దిగంబర చిత్రం నిజంగా వేమనగారిదేనా? ఇటీవల కొన్ని పరిశోధనల తర్వాత నాకీ అనుమానం కలిగింది. ఈ చిత్రం వేమన గారిది కాదేమో అన్న నమ్మకం కూడా కొద్దిగా కలుగుతోంది.

ఇంతకీ వేమనగారు దిగంబరులేనా? అన్నది ముందు తెల్సుకోవలసిన విషయం. దిగంబరత్వాన్ని సమర్థిస్తూ కొన్ని పద్యాలు వేమన శతకాలలో కనబడతాయి.

తల్లి గర్భమందు దా బుట్టినప్పుడు
మొదల బట్టలేదు తుదను లేదు
నడుమ బట్టగట్ట నగుబాటు కాదొకో
విశ్వదాభిరామ వినురావేమ.

ఇది చాలా సుప్రసిద్ధ పద్యం. దీనివల్ల వేమనగారు దిగంబరత్వాన్ని ప్రబోధిస్తున్నారని విశదం అవుతుంది. దిగంబరత్వానికి ముందు వారికి పుట్టగోచిమాత్రం వుండేదని చెప్పవచ్చు. దానినీ వారు విసర్జించారేమో.

గోచి యూడె ననుచు కోతిగ నాడించి
వెర్రియోగి నూరు వెడలమంద్రు
తనదు భార్యముందు తా గోచి తీయడా
విశ్వదాభిరామ వినురవేమ.

ఇది యోగి దిగంబరుడయినప్పుడు ఊరివాళ్ళు కోపంతో ఊరు వెళ్ళగొట్టిన సందర్భంగా చెప్పిన పద్యంలాగ కనబడుతుంది. ఈ పద్యంమూడవ పాదంలో ' ఎవరి గోచులూడ వీ ప్రొద్దు గ్రుంకిన' అనే పాఠాంతరం కూడావుంది.

వేమనగారు చూడని దర్శనం లేదు. తొక్కని మార్గం లేదు అని గట్టిగా నమ్మడానికి తగినన్ని పద్యాలు ప్రతి విషయం మీదా మనకు లభిస్తాయి. ఇందులో ఏ పద్యాలు ఆయన చెప్పినవో ఇప్పటికీ నిర్ణయించడానికి వీలుగా సంశోధిత ప్రతి రాలేదు. వేమనగారు ఒకప్పుడు దిగంబరంగా సంచరించినా ఉత్తరోత్తరా పసుపు బట్టలు కట్టుకొని పాంకోళ్ళు తొడుక్కొని గుర్రమెక్కి ఊరూరా తిరిగేవారని ఊహించడానికి కూడా ఆస్కారముంది.

వేమనగారి శిష్యుల పీఠాలు కడపలో నేడు చాలా వున్నాయి. ఆ శిష్యులకు పసుపుబట్టలూ,

---

★ ఆరుద్ర ప్రముఖ సాహితీ వేత్త, మద్రాసు

పాంకోళ్ళూ, బక్క గుఱ్రాలూ నేడు విధిగా వుంటాయి. ఈ శిష్య పరంపరను చూసిన వాళ్ళు ఈ విషయాలు చెప్పారు. వేమనగారు దిగంబరులైతే వారి శిష్యపరంపర పసుపుబట్టలు ఎందుకు తొడుక్కోవాలి? నేటికీ రాయలసీమలో దిగంబర యోగినులే వున్నారు. ఈ మధ్య పత్రికలకు కూడా ఎక్కారు. వేమనగారు చివరిలో దిగంబరులుగానే ఉంటే వారి పేరు చెప్పుకొనే శిష్యపరంపర దుస్తులు తొడుక్కోవలసిన అవసరం లేదు. ఈ శిష్యులు, తుంగవేమన తాలూకువాళ్ళని కొట్టిపారెయ్యడానికి కొందరు ప్రయత్నించవచ్చు.

ప్రస్తుతం ప్రచారంలో వున్న దిగంబర చిత్రానికి ఒక చరిత్ర వుంది. వాస్తవానికి వేమనగారి పటాలుగా నాల్గైదు చిత్రాలు వివిధ రకాలవి 1907 నుండే ప్రచారంలో వున్నాయి. ప్రస్తుతం బహుళ ప్రచారం పొందినది ఎందుకు రూఢమైనదో ఈ చరిత్రను పరిశీలిస్తే తెలుస్తుంది.

వేమన పద్యాలను 1829లో మొట్టమొదటిసారిగా బ్రౌను దొరగారు ముద్రించారు. కారణాంతరాలచేత ఈ ముద్రణ విస్తృత ప్రచారాన్ని నోచుకోలేదు. మరో పదేళ్ళకి 1839లో బ్రౌను దొరగారే మరో ముద్రణ ప్రచురించారు. బ్రౌను దొరగారి సంకలనాన్ని యథాతథంగానో, లేక కొద్ది మార్పులతోనో, కృతజ్ఞతలు చెప్పిగానీ, చెప్పకగానీ అనేకులు తెలుగులోనూ, తమిళంలోనూ కిందటి శతాబ్దంలో 1843 నుండి అచ్చు వేస్తూనే వున్నారు. అయితే ఈ శతాబ్దం తొలిరోజుల్లో తప్ప వేమనగారి బొమ్మను ఏ ముద్రణలోనూ ఎవరూ చేర్చలేదు. ( డాక్టర్ గోపి తన ప్రజా కవి వేమనగ్రంథంలో బ్రౌను దొరగారి కాలం నుంచి వేమన పద్య సంకలనాల ప్రచురణల వివరాలను ఓపికతో సేకరించాడు)

''కొల్లాపురం అగ్రహారం నివాసి'' పమ్మి త్యాగరాయ శెట్టి గారు తమ శ్రీ రాజరాజేశ్వరీ నికేతన ముద్రాక్షరశాలలో 1901లో వేమన పద్య సంకలనం ఒకటి ప్రకటిస్తూ దానిలో వేమన గారి బొమ్మను కూడా ప్రచురించారు. ఇది 1908 నాటి కూర్పులో కూడా ఉంది. ఈ బొమ్మ ఒక సిపాయి ఇంట్లో ఉన్న రంగుల బొమ్మకు నకలు అని ప్రకాశకులు ప్రకటించారు. ఈ బొమ్మ ఇప్పుడు ప్రచారంలో ఉన్న ప్రసిద్ధ చిత్రానికి కొంచెం వేలువిడిచిన బంధువులాగ ఉంది.

1913లో రాయవరం పూర్ణయాచారిగారు బందరు నుంచి 'వేమన సూక్తి రత్నాకరం,' అనే అకారాదిసంకలనం ప్రకటించారు. ఇందులో ఒక బొమ్మను వేమనగారిదని చెప్తూ అచ్చువేశారు. ఇది దిగంబర చిత్రంకాదు.

1916లో నెల్లూరు జిల్లా మైపాడు నివాసి కరూరు బంగారయ్యగారు ''వేమనార్యుని పద్య పదశబ్దార్థము'' అనే పుస్తకం వ్రాసి చెన్నపట్నం పాతచాకలిపేటలో ప్రకటించారు. ఇందులో అచ్చువేసిన వేమనగారి బొమ్మ కింద 'వెర్రి వేమన' అని రాశారు.

1922లో శ్రీ వంగూరు సుబ్బారావుగారు ''వేమన (సంపూర్ణ జీవిత చరిత్రము - బోధనలు)'' అనే గ్రంథం ప్రచురించారు. ఇందులో ''తంజావూరు రాచనగరు చిత్రపటము

నుంచి తీసినది'' అని వివరిస్తూ వేమనగారి పటాన్ని ముద్రించారు. ఇదే ఇప్పుడు ప్రచారంలో వున్న బొమ్మకు మాతృక.

1925లో వావిళ్ళవారు (తమ పూర్వ ముద్రణలలో దేనిలోనూ వేయకపోయినా) తాము ప్రచురించిన ముద్రణలో వేమనగారి పటాన్ని తంజావూరు రాచనగరుదే అని చెప్పి అప్పటి తంజావూరు మహారాష్ట్ర రాజుల వారసుడు '' శ్రీ కృష్ణారావు భాన్స్లే'' గారి సౌజన్యంతో ప్రచురించారు. ఈ బొమ్మ నాటినుండీ బహుళ ప్రచారంలోనికి వచ్చింది.

1926లో తమిళంలో ప్రచురితమైన ''వేమన పద్దియం'' అనే గ్రంథంలో ఒక వేమనగారి బొమ్మ వుంది. దీనికీ ప్రచారంలో వున్నదానికీ ఏ మాత్రం పోలికలు లేవు. ఈ బొమ్మ సన్యాసి బొమ్మకూడా కాదు. జందెం వుంది.

ఇదీ కాలక్రమానుగుణంగా వేమనగారి చిత్రాల చరిత్ర. వంగూరి వారు, వావిళ్ళవారు తంజావూరు రాచనగరులోని చిత్రానికి నకళ్ళు ప్రచురించారు. అయితే ఇంతకీ తంజావూరు రాచనగరులో వేమన గారి చిత్రపటం వుందా? అక్కడ ఒక దిగంబరయోగి చిత్రం మాత్రం వుండేది. 1928కి పూర్వమే కట్టమంచి రామలింగారెడ్డిగారు తంజావూరు రాజమహల్‌లో ఒక దిగంబర సన్యాసి చిత్రాన్ని చూశారు. ఇది వేమన గారిదని అక్కడివాళ్ళు చెప్పారు. ఇందులో ఎంతవరకు సత్యముందని రెడ్డిగారు అనుమానించారు.

నేను 1955లోసరస్వతీమహల్‌పై రేడియో వారికి ఒక ప్రసంగ వ్యాసం రాసే సందర్భంలో తంజావూరు వెళ్ళాను. చూడవలసినవన్నీ చూశాను. రాచనగరు సందర్శించడమేకాక మహారాష్ట్రరాజుల వృద్ధవారసుణ్ణి కలుసుకొన్నాను. నేను చూసిన చిత్రాలలో ఒక దిగంబర సన్యాసిది కూడా ఉన్నట్టు లీలగా మాత్రమే జ్ఞాపకం.

మహారాష్ట్ర రాజుల కాలంలో వేమనగారు తంజావూరులో పర్యటించారని చెప్పడానికి వారి పద్యాలలో ఒక ఆధారం లేకపోలేదు. కానీ రాచనగరుకూ, వారికీ, వారి బొమ్మను వేయించి పెట్టుకొనేటంత, ప్రగాఢ సంబంధం ఉన్నట్టు చెప్పడానికి ఏ విధమైన ఆధారాలూ లేవు.

నిజానికి తంజావూరు రాచనగరుతో ఇంకో సుప్రసిద్ధ సన్యాసికి సంబంధం వుంది. నాయకరాజుల రాజ్యపతనం తర్వాత తంజావూరును మహారాష్ట్ర రాజులు పాలించారు. ఏకోజీ 1676నుంచి 1683 దాకా పాలించాడు. ఇతని తర్వాత ఇతని కుమారులు ముగ్గురూ ఒకరి తర్వాత ఒకరు పాలించారు. శాహజీ (1684-1710) శరభోజీ (1711-1728) తులజాజీ (1729-1735) అనే ముగ్గురి అన్నదమ్ముల పాలనలో సంస్కృతాంధ్ర మహారాష్ట్ర కవితలు తంజావూరులో వెల్లివిరిశాయి. తత్త్వశాస్త్ర చర్చలు జరిగాయి. అద్వైతం మళ్ళీ తల ఎత్తింది. శాహాజీకి బిడ్డలు లేరు. శరభోజీ బిడ్డలకోసం నోచని నోము లేదు.

సంతానం కోసం శరభోజీ వివిధక్షేత్రాలలోని దేవతలకు మొక్కులు మొక్కుకున్నాడు. ఆ

మొక్కులు చెల్లించడానికి తనతరఫున తన ఆస్థాన విద్వాంసుడు మలహారి పండితుణ్ణి ఆయా క్షేత్రాలకు పంపించాడు. పుణ్యక్షేత్రాలు దర్శించుకొంటూ మలహారి పండితుడు దాసాంబా పురానికి వచ్చాడు. అది శరభోజీ తల్లిపేర నిర్మించిన ఊరు. అక్కడ సదాశివ బ్రహ్మేంద్రులు వుంటున్నారు. వారిని దర్శించుకొని మూడు భిక్షలు నివేదించుకొని సేవించుకొని పండితుడు తన రాజుగారి పుత్ర వాంఛను విన్నవించుకొన్నాడు. సదాశివ బ్రహ్మేంద్రులు అనుగ్రహించి శరభోజీని దీవిస్తూ తమ కృతి '' ఆత్మవిద్యావిలాసం'' ప్రతినొకదానిని రాజుకు పండితునిద్వారా పంపించారు. సదాశివ బ్రహ్మేంద్రుల దీవనఫలించి శరభోజీకి అనతికాలంలోనే పుత్రోదయమైంది.

ఈ చారిత్రక వివరాలను ఆచార్య వి. రాఘవన్‌గారు శ్రీధర వెంకటేశుల శాహేంద్ర విలాస కావ్యానికి ఉపోద్ఘాతంరాస్తూ, సాక్ష్యాధారాలతో విశదపరిచారు. (పుట19) ఈ పుస్తకం తంజావూరు సరస్వతీమహల్ ప్రచురణలలో 54వ నెంబరుది. ఈ వివరాలవల్ల సదాశివ బ్రహ్మేంద్రులకూ తంజావూరు రాచనగరికి ప్రగాఢ సంబంధం కనబడుతుంది. పుత్రోదయమయ్యాక శరభోజీ బ్రహ్మేంద్రుల తైలవర్ణ చిత్రాన్ని రాయించుకొని నగరులో పెట్టుకున్నారా?

సదాశివ బ్రహ్మేంద్రులు చాలా సుప్రసిద్ధులు. ప్రస్తుతం సంగీతరంగంలో ప్రచారం పొందిన ''మానస సంచరరే'' ''పిబరే రామరసం'' వంటి కీర్తనలలు వీరురాసినవే. దక్షిణాదిని నామ సిద్ధాంత-భజన పద్ధతులను శ్రీధర వెంకటేశులతోపాటు సదాశివ బ్రహ్మేంద్రులూ ప్రచారం చేశారు. వీరి గురించి సంగీత సంప్రదాయ ప్రదర్శినిలో సుబ్బరామ దీక్షితులవారు ఇలా రాశారు:

''అమరానదీ తీర మందుగల కరూరునందును, కావేరీ తీరమైన కరూరు కొడుముడి మొదలైన పుణ్యక్షేత్రములందును 163 సంవత్సరములకు మునుపు దిగంబరులై సంచరించుచు జ్ఞానపరులైన సదాశివబ్రహ్మము అను మహాపురుషులు బ్రహ్మానంద పరవశులై యున్నసమయములందు గేయవాగ్రూపముగా సంస్కృత కీర్తనములనేకము చేసియున్నారు. అవి యిప్పుడును ప్రసిద్ధముగా నున్నవి.....''

సుబ్బరామ దీక్షితులవారు సంగీత సంప్రదాయ ప్రదర్శిని 1901 లో రాశారు. అప్పటికి 163 సంవత్సరాలకిందట అంటే క్రీస్తుశకం 1738 ప్రాంతాలు. ఆకాలంలో ఒక దిగంబర సన్యాసి ఉండడం వారికి తంజావూరు రాచనగరుతో సంబంధం ఉండడం చూస్తే వారి చిత్రపఠమేగాని వేమనగారి చిత్రపఠానికి తంజావూరు రాచనగరితో సంబంధం ఉండడానికి ప్రస్తుతం ఆస్కారం కనబడలేదని చెప్పవచ్చు.

భావి పరిశోధనలు నిజం తేల్చవచ్చు.

(శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం వారి సౌజన్యంతో)

# భావితరాలకు స్ఫూర్తి స్వీయచరిత్రలు

- డా॥ సి. సూర్యనారాయణ

స్వార్థత్యాగులై లోకోపకారపరాయణులై ఉత్తమ జీవితాలు జీవించిన మహాపురుషుల చరిత్రలు భావితరాల వారికి ఆదర్శంగా నిలుస్తాయి. అట్టివారి చరితలతో దేశచరిత్ర చరితార్థమవుతుంది. అలాంటి మహనీయుల గురించి ఇతరులు రాస్తే అవి జీవిత చరిత్రలౌతాయి. ఎవరి చరితం వారే రాసుకుంటె అది స్వీయ చరిత్రలేక ఆత్మకథ అవుతుంది. ఈ స్వీయ చరిత్ర అనేప్రక్రియ ఆంగ్లసాహిత్య ప్రభావం వల్ల తెలుగులో ప్రవర్తిల్లింది. ఆంగ్లంలో ' ఆటోబయోగ్రఫీ' అని వ్యవహరించే యీ ప్రక్రియను తెలుగులో 'స్వీయచరిత్ర' అని మొదటిసారిగా పేర్కొన్న వారు శ్రీగురజాడ శ్రీరామమూర్తి ''తాను వ్రాసుకున్న తన చరిత్ర'' అనే అర్థంలో ఈ పదాన్ని వారు ప్రయోగించారు.

ఉత్తమ పురుషలో రాసిన నవలకూ స్వీయ చరిత్రకూ శిల్ప పరంగా కొంత సారూప్యం కనిపిస్తుంది. అయితే నవలా కారునకున్న స్వేచ్ఛ స్వీయ చరిత్ర రచయితకు ఉండదు. స్వీయ చరిత్ర కేవలం వాస్తవాన్ని ఆధారం చేసికొని సాగవలసిన రచన. ఏదైనా ఒకరంగంలో గణనీయమైన కృషి చేసిన వ్యక్తి తప్ప స్వీయ చరిత్ర రాసుకోవడం సార్థకం కాదు. స్వీయ చరిత్ర రాసుకునే వ్యక్తికి సరైన యోగ్యతా ఆదర్శ చరిత్రా ఉండాలి. ఆ రచనవల్ల పాఠకులకు చక్కని సందేశం అందాలి.

సాధారణంగా కవులూ కళాకారులూ సంఘ సంస్కర్తలూ మేధావులూ రాజకీయవేత్తలూ స్వీయచరిత్ర రాసుకోవడం పరిపాటి. చాలా రచనలు ఆయా రచయితల జీవితానుభవాలకు మాత్రమే పరిమితమైపోవడం వల్ల ప్రయోజనాన్ని సాధించలేక పోతున్నాయి. రచనను ఒక సామాజిక చర్యగా గుర్తించి తమరచనలో సమాజాన్ని ప్రతిబింబించిన వారి రచనలు మాత్రమే అనుకున్న ప్రయోజనాన్ని సాధిస్తాయి. భావితరాలకు స్ఫూర్తినిస్తాయి.

తెలుగులో స్వీయచరిత్రలు పద్యంలోనూ వచనంలోనూ కూడా వెలువడ్డాయి. వచనంలో వెలువడిన మొట్టమొదటి స్వీయచరిత్ర కందుకూరి వీరేశలింగం గారిది. ఈ స్వీయ చరిత్ర కొమర్రాజువేంకటలక్ష్మణ రావు పంతులుగారి సంపాదకత్వంలో 1911 సం॥లో మొదటి భాగం ముద్రితమయింది. కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు కందుకూరి వారిస్వీయచరిత్రను విమర్శిస్తూ 'స్వీయచరిత్ర' అనే ప్రయోగం తప్పనీ 'స్వకీయ చరిత్ర' అని ప్రయోగించాలనీ వ్రాశారు. కానీ, వ్యవహారంలో 'స్వీయచరిత్ర' మే రూఢి అయింది.

తెలుగులో మొదటిస్వీయ చరిత్ర విషయంలో కొంత వివాదముంది. వెన్నెలకంటి సుబ్బారావు గారిస్వీయ చరిత్ర 1872లో అచ్చయింది. అయితే అది ఆంగ్లంలో ఉంది. ఆదిభట్లనారాయణదాసు

---

★ డా. సి. సూర్యనారాయణ, ప్రసిద్ధరచయిత, విజయనగరం.

గారిది మొదటిదనే వాదం కూడా వుంది. కాని కందుకూరిదే ముందు అచ్చయింది. కాగా తెలుగువాడు తెలుగులో రాసుకొని ప్రచురించిన మొదటి స్వీయచరిత్ర కందుకూరి వీరేశలింగం గారిదేనని చెప్పాలి. ''తెలుగుభాషలో స్వీయచరిత్రమును వ్రాయబూనుకొనుటకిది ప్రథమ ప్రయత్నము'' అని కందుకూరి వారు అవతారికలో రాసుకున్నారు. వారి స్వీయచరిత్ర యించుమించుగా అర్థశతాబ్ది ఆంధ్రదేశపు సాంఘికచరిత్రగా చెప్పవచ్చు. అఖిల భారతదేశస్థాయిలో రాజారామమోహన రాయల వారెటువంటిసేవ చేశారో! దక్షిణ భారతదేశానికి వీరేశలింగం పంతులుగారు అటువంటి సేవచేశారు. వీరి స్వీయచరిత్ర ద్వారా నాటి తెలుగు సమాజాన్ని సాంఘిక సాంస్కృతిక ఉద్యమాల్ని గురించి తెలుసుకోవచ్చు.

రచన దృష్ట్యా వీరేశలింగం గారి తర్వాత పేర్కొదగింది రాంభట్ల జగన్నాథ శాస్త్రి గారి స్వీయచరిత్ర. లోకోక్తులూ సామెతలూ సంస్కృతాంధ్ర సాహిత్యాల్లోని మానవస్వభావాన్ని తెలిపే అన్వర్థరత్నాల వంటి ఉదాహరణలతో గొప్ప సాహిత్యగ్రంథంలావుంది. తన కాలపు సాంఘిక పరిస్థితుల్ని ఆసక్తి దాయకంగా వర్ణించారు.

త్యాగ, ధర్మ, సత్యనిరతులకూ, సంఘసేవకూ జీవితమున అధిక ప్రాధాన్యమిచ్చిన సుప్రసిద్ధ విద్యావేత్త రాయసం వేంకటశివుడుగారి స్వీయచరిత్ర అనేకవిధాల పఠితలకాదర్శంగా నిలుస్తుంది. వీరేశలింగంగారి స్వీయచరిత్రతో దీటైనది చిలకమర్తివారి స్వీయ చరిత్ర. ఆనాటి సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక, సారస్వత విషయాల్ని వివరిస్తుంది. టంగుటూరి ప్రకాశం పంతులుగారి 'నాజీవితయాత్ర' లో నాటి రాజకీయాలూ సంస్కృతీ చరిత్ర తొలినాళ్ళలో కాంగ్రెసునిర్వహించిన పాత్ర, దక్షిణాది రాజకీయాలూ ఉద్యమాలూ, కారాగార వాసాలూ మొదలైన వెన్నో ప్రసక్తమయ్యాయి. దేశభక్తకొండావెంకటప్పయ్యగారు ఆంధ్రోద్యమపితామహుడని చెప్పదగ్గవారు. సత్యం, వినయం, త్యాగం దేశసేవ ఆర్జవం అనేవి వారి జీవితానికి పెట్టని సొమ్ములు. వారి స్వీయచరిత్రని రెండు భాగాలుగా ప్రకటించారు. ఆనాటి కాంగ్రెసురాజకీయాలూ ఆంధ్రోద్యమమూ నాటి దేశకాలపరిస్థితులూ ఉప్పుసత్యాగ్రహం ప్రథమాంధ్రమహాసభలు కాంగ్రెసులో అతివాదమితవాద పక్షరాజకీయాలు మొదలైనవి వర్ణించారు.

అయ్యదేవరకాళేశ్వరరావుగారి 'నాజీవితకథ-నవ్యాంధ్రము' తత్కాలసమగ్రాంధ్రదేశచరిత్రయే అని చెప్పాలి. తాము స్వీయచరిత్రను ఎందుకురాసుకున్నారో యీవిధంగా తెలియజేశారు.

''దేశ స్వాతంత్ర్యము విశాలాంధ్రస్థాపనము స్వయముగా చూచి అనుభవించు అదృష్టము నాకులభించెను. కావున భావితరాల వారికి ఆంధ్రదేశములో జరిగిన విప్లవములను గూర్చియు వాటిని నడిపిననాయకులను గూర్చియు వాటిలోనాకు గల అనుభవములను గూర్చియు క్లుప్తముగ తెలుపనుద్దేశముతో నీగ్రంథమును వ్రాసితిని'' అన్నారు. స్వీయ చరిత్ర రాసుకున్న ప్రతిమహనీయుని ఉద్దేశమూ అదే అయివుంటుంది.

దరిశి చెంచెయ్య గారి 'నేనూ-నాదేశము' నిజంగా దేశచరిత్రయే. ఆనాడు దేశంలో వచ్చిన ఆర్థిక సాంఘిక రాజకీయ ఉద్యమాలూ వాటి ప్రభావాలూ ఫలితాలూ వీరి స్వీయచరిత్రలో ప్రతిబింబించాయి. 1913-19 సం॥ల మధ్య తీవ్రంగా సాగిన గదర్ ఉద్యమం గురించి కూడా వివరించారు. తెలుగులో వచ్చిన గొప్ప స్వీయ చరిత్రల్లో 'నేనూ నాదేశము' కూడా ఒకటి. తెలంగాణా ప్రాంతంలో చెలరేగిన అపూర్వ విప్లవసమగ్రచరిత్ర మాదిరాజు రామకోటేశ్వరరావుగారి స్వీయచరిత్ర.

కథక చక్రవర్తి శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు ''అనుభవాలూ జ్ఞాపకాలూను'' అనేపేర తన స్వీయ చరిత్రను 8 సంపుటాలుగా రాయబూని 3 సంపుటాలు మాత్రమే రాసి పరమపదించారు. వారిశైలి సర్వజన మనోహరమైంది. ఆనాటి గోదావరి జిల్లాల బ్రాహ్మణాగ్రహారాలు, కులవిద్యలు, సాంఘిక పరిస్థితులు, యజ్ఞయాగాదులు, ఆనాటి పెద్దలు, వదాన్యులు, సాహిత్య ఉద్యమాలు, సాంఘిక ఉద్యమాలు, వైదికాచారాలు మొదలైన విందులో దర్శనమిస్తాయి. వారు సంపూర్ణస్వీయచరిత్ర రాసివుంటే అది ఆంధ్రుల సంస్కృతి చరిత్రగా నిలిచేది.

ఆత్మకథను తన ఆధ్యాత్మిక వికాస కథగా భావించిన బాపూజీ ఆత్మకథని వేలూరి శివరామశాస్త్రిగారు, కాటూరి వేంకటేశ్వరరావుగారు వచనంలో అనువదించగా తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు పద్యకావ్యంగా రాశారు. నైతిక జీవనాన్ని నిష్ఠతో పాటించగోరే వారికది పాఠ్యగ్రంధంలాంటిది. మనిషిలో సత్యాన్వేషణాసక్తి నిలిచి ఉన్నంతకాలం బాపూజీ ఆత్మకథ మార్గదర్శకంగా నిలుస్తుంది. స్వీయలోపాల్ని కూడా వెల్లడించిన మహనీయుడు బాపూజీ. అట్టివారు ఈలోకంలో అరుదు.

పూర్వపు హైదరాబాదు రాష్ట్రంలో మంత్రిణిగా పనిచేసిన శ్రీమతి సంగం లక్ష్మీబాయమ్మగారు 'నా అనుభవములు' ప్రకటించారు. నైజాం పాలనలో మతోన్మాదులు చేసిన దుండగాలు రజాకార్ల దురంతాలు, ఆనాటి సాంఘిక ఆర్థిక రాజకీయ పరిస్థితులు చక్కని శైలిలో రాశారు. శ్రీమతి బసవరాజు రాజ్యలక్ష్మమ్మగారు రాసిన 'అప్పారావుగారూ-నేనూ' అనేది మరో చక్కని స్వీయచరిత్ర. అప్పారావుగారి మిత్రులగురించీ అభిరుచులగురించీ అప్పటి కాంగ్రెసు రాజకీయాల గురించి ఆంధ్రోద్యమం గురించీ ఎన్నో విషయాలు గ్రంథస్థం చేసారు. ప్రసిద్ధ సంఘసేవకురాలు శ్రీమతి ఎల్లాప్రెగడ సీతాకుమారిగారు తమస్వీయ చరిత్రలో మహిళాభ్యుదయానికి తాముచేసిన కృషీ ఎదుర్కొన్న సమస్యలూ వివరించారు.

స్త్రీ జనోద్ధారకులు డా॥కేసరిగారు 'నాచిన్ననాటిముచ్చట్లు' రాసుకున్నారు. లౌకిక జీవితం కంటే ఆధ్యాత్మిక జీవితానికే ప్రాముఖ్యమిస్తూ ప్రముఖ పరిశోధక పండితులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ప్రజ్ఞాప్రభాకరము ప్రకటించారు. 'రాలూ-రప్పలూ' తగలకుండానే

ఆగిపోయిన స్వీయచరిత్ర తాపీధర్మారావు గారిది. తనముప్ఫయ్యేళ్ళ జీవితానికే పరిమితమైన 'నాయెఱుక' హరికథాపితా ఆదిభట్ల నారాయణదాసుగారిది. ఇందులో 19వ శతాబ్ది చివరి పాదంలో ఆంధ్రదేశ స్థితిగతులూ, ప్రజాజీవితం వివరించారు. కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారి ఆత్మకథ విద్యాభ్యాసం లోనే ఆగిపోయింది. జీవిత చరిత్ర కారునిగా ప్రసిద్ధులైనగొర్రెపాటివేంకటసుబ్బయ్యగారు 'నాసాహిత్యకృషి' ప్రకటించారు. ప్రముఖ కథారచయిత బుచ్చి బాబుగారు 'నా అంతరంగ కథనం', లలితకళాకోవిదుడు సంజీవదేవ్ గారు, చలం ఆత్మకథలను ప్రకటించుకున్నారు.

పండితులుగా ఉత్తమ అధ్యాపకులుగా తెలుగునాటప్రసిద్ధులైన దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారు తమ స్వీయచరిత్రను రమణీయంగా రాసుకున్నారు. ఆనాటి పండితులవిశేషాలెన్నో అందులో దర్శనమిస్తాయి. ఆచంట జానకీరాంగారు 'నాస్మృతిపథంలో' 'సాగుతున్నయాత్ర' అనిరెండు సంపుటాల్లో వారి అనుభవాలూ జ్ఞాపకాలూ కవిమిత్రులతో పరిచయాలూ చిన్నచిన్న కథలుగా రాశారు. ప్రతివాది భయంకరాచార్యులవారు తమ 'అండమాన్ జీవితం' లో బ్రిటీషు వారి పాలనలో దేశభక్తులు, సత్యాగ్రహులు, విప్లవాదులు ఎలాంటి క్రూరమైన శిక్షలు అనుభవించారో ఎన్ని బాధలు పడ్డారో ఎలాంటి కష్టాలకోర్చుకున్నారో కళ్ళకు కట్టినట్లు వర్ణించారు. డా॥ ఉప్పల లక్ష్మణరావుగారి 'బతుకుపుస్తకం' తెలుగు సామాజిక రాజకీయ ఆర్థిక జీవితానికి పట్టిన దర్పణం. కాళోజీగారి 'నాగొడవ' పీడిత తెలంగాణా ప్రజల గాథ. 1930 దాకా తెలుగు సాహిత్యం నన్ను నడిపించింది. ఆతర్వాత నుంచీ దాన్ని నేను నడిపిస్తున్నాను. అప్పటి నుంచీ తెలుగు సాహిత్యం చరిత్ర శ్రీశ్రీ స్వీయచరిత్ర అన్న శ్రీశ్రీ 'అనంతం'గా తనస్వీయ చరిత్రను ప్రకటించారు.

తిరుపతి వేంకటకవుల 'జాతక చర్య' జాషువాగారి 'నాకథ' తెనుగు రాజుగారి 'తెనుగురాజు' మొ॥పద్యాల్లో రాసిన స్వీయ చరిత్రలు ఇతర ప్రక్రియలకు మాదిరిగా స్వీయచరిత్రలకుకూడా పేరడీలు వచ్చాయి. జరుక్ శాస్త్రిగారి దేవయ్యస్వీయచరిత్ర, ఉప్పులూరి వేంకటసుబ్రహ్మణ్యం గారి రాసభరావు పంతులు స్వీయచరిత్ర ఆకోవకు చెందినవే. తెలుగులో యిప్పటికి వందకుపైగా స్వీయ చరిత్రలువెలువడ్డాయి. దేశాభ్యుదయానికీ సంఘశ్రేయస్సుకూ పాటుబడిన మహనీయుల జీవితాలు భావితరాలకు స్ఫూర్తిగా నిలిచి, మునుముందుకు నడిపిస్తాయి. అందువల్ల వారి స్వీయ చరిత్రలు అవశ్యపఠనీయాలు.

(ఆకాశవాణి విశాఖపట్టణం కేంద్రం వారి సౌజన్యంతో)

# మత విశ్వాసం కట్టుడు పన్ను

– మిసిమి రచనల వర్క్ షాపు

మత బోధలన్నీ ఊహా ప్రపంచ విహారాలేననీ, వాస్తవికత ఏమీ లేదని మానవతావాదు లందరూ అంటూ ఉంటారు. శాస్త్ర సాంకేతిక విజ్ఞానం ఎంతో అభివృద్ధి చెందిన ఈ యుగంలో కూడా మతం పేరుతో ఊహా ప్రపంచ విహారం ఎందుకు కొనసాగుతున్నది? కాదు విస్తరిస్తున్నది?

తత్వవేత్త హాన్స్‌వైహింగర్ ఇలా అంటాడు: ''మానవుడు పరిసరాలతో సర్దుబాటు చేసుకునే క్రమంలో చైతన్యం వృద్ధి చెందింది. ఈ పరిణామంలో ఎక్కడో ఒక చోట, చైతన్యం, పరిసరాలతో బంధనం తెంచుకున్నది. చైతన్య వికాసం ఏకైక లక్ష్యం అయింది. విముక్తి చెందిన చైతన్యం అసాధ్యమూ, అసంగతమూ అయిన ప్రశ్నలను వేసుకున్నది.

''సృష్టికి కారణం ఏమిటి? పదార్థం చలనం, జీవిత లక్ష్యం ఏమిటి? చైతన్యం జీవ శాస్త్ర సంబంధితమైన మేరకు, ఈ సమస్యలకు సమాధానం ఎన్నటికీ లభించదు.''

తత్వశాస్త్రం ఈ విధంగా ఆవిర్భవించింది. తాను ఆశించిన జ్ఞానాన్ని మనస్సు పొందజాలదు. మిధ్యాజ్ఞానాన్ని మనస్సు ఆశ్రయించింది. దాంతో అనంత మీమాంసకు సమాధానం దొరికినట్లు భ్రమించింది.

ఈ విధంగా అనేక తాత్విక ధోరణులు ఆవిర్భవించాయి. ఊహా ప్రపంచ సమస్యలు, వాస్తవిక సమస్యల కంటె అధిక ప్రాధాన్యత సంపాదించాయి.

సమాధానం దొరకని సమస్యలకు సమాధానం ఇవ్వటమే మతం చేస్తున్న పని. ఈ సమాధానాలు అశాస్త్రీయాలు అర్థరహితాలు. అయినా ఇవి ప్రజలను తృప్తిపరుస్తున్నాయి. ఏదో విధమైన, భ్రమతో కూడుకున్న తృప్తితో ఈ అనంత జిజ్ఞాస ముగిస్తే తప్ప, నిత్య లౌకిక వ్యవహారాలపై మనం దృష్టి మరల్చలేము.

నోట్లో ఒక పన్ను ఊడి పోతే నాలుక, నిరంతరం ఆ ఖాళీస్థలాన్ని స్పృశిస్తూ ఉంటుంది. అనేకమైన చీకాకులు కలిగిస్తుంది. కట్టుడు పన్నును ఆ ఖాళీలో అమరిస్తే, ఈ చీకాకులు తగ్గుతాయి. మత విశ్వాసం కట్టుడు పన్ను అని చెప్పవచ్చు.

ఆర్థర్ షోపన్‌హర్ 'మతం' అనే పుస్తకంలో ఇలా అంటాడు:

'' ప్రజలకు అర్థమైన తత్వశాస్త్రం మతం. మతం అశాస్త్రీయం. అయినా ప్రజలను అలా ఉండనివ్వండి. ప్రజల మూఢ విశ్వాసాలను హేళన చేయకండి. ఈ మూఢ విశ్వాసాల ద్వారానే బహుశా వారు ఎప్పటికైనా యధార్థజ్ఞానాన్ని చేరుకుంటారు.

మూఢ విశ్వాసాలన్నిటినీ చీల్చి చెండాలని, హేతువాదులు, మానవతావాదులు చేసే ప్రయత్నాలన్నీ నిరర్థకాలా? కావు. ఎపుడో ఒకపుడు ఈ మిథ్యా జ్ఞానం నశించ వలసిందే. మత విశ్వాసాలన్నీ భ్రమలని ప్రతి ఒక్కరూ గుర్తించ వలసిందే. ఈ గుర్తింపు ఆయా వ్యక్తుల అంతరంగ మధనం నుండి ఆవిర్భవించాలని అందుకు ఒక్కొక్కరు ఒక్కొక్క కాలపరిమితిని తీసుకుంటారని మాత్రమే నేను చెప్పదలచుకున్నాను.

ఊహా ప్రపంచాని కుండే విలువ, ప్రయోజనం దానికి ఉంటుంది. సత్యాశోధనకై ఉండే జిజ్ఞాసకు, ఊహాత్మక విహారానికి దేనిస్థానం దానిదే తొలి మెట్టు మలి మెట్టు అని చెప్పవచ్చు.

ఊహా ప్రపంచంలో తేలియాడటం తప్పా మంచిదా అని ప్రశ్నిస్తే తద్వారా మీకు ఆనందం

కలిగితే తప్పులేదు. బాధ కలిగితే మాత్రం తప్పు అని ప్రముఖ ఆఫ్రికా అమెరికన్ మానవతా వాది చార్లెస్ ఫాక్నర్ అంటాడు.

అయితే ఇందులో ఒక ప్రమాదం ఉంది. భవిష్యత్తులో ఏమి జరుగుతుందో అనే ఊహా ప్రపంచంలోకి వెళ్ళటం హానికరం. అశాస్త్రీయ భావనలు చేయటం ప్రమాదకరం, తన వ్యక్తిగత భవిష్యత్తును గురించి అదే పనిగా ఊహించుకుంటే బాధపడటం, నిరాశానిస్పృహలకులోను కావటం తప్పదు.

వాషింగ్టన్ ఏరియా లౌకిక మానవతావాద సంఘాధ్యక్షుడు కెన్నెల్ మార్సవెక్ ఇలా అంటాడు:

''శాస్త్రీయ నవలా సాహిత్యానికి ఒక ప్రయోజనం ఉంది. శాస్త్రజ్ఞానం పెరిగిన కొద్దీ ఎలాంటి విచిత్రాలు సాధ్యమో మనం చదివి ఆనందించవచ్చు. ఎప్పటికైనా అందులో కొన్ని నిజం కావచ్చు కూడా. ప్రాచీన పురాణ గాధల నుండి ఉత్సాహం పొందలేని వారు సైతం బహుశా శాస్త్రీయ నవలా సాహిత్యం నుండి ఉత్సాహం పొందవచ్చు. కట్టు కథలలో హింసాత్మక సంఘటనల మోతాదు, విచిత్ర సంఘటనా పరంపర అధికంగా ఉంటే, ప్రయోజనం కంటె అవి హానిని ఎక్కువ కలిగిస్తాయి.

కలలుకనే శక్తి లేనివాడు, వాస్తవిక ప్రపంచం విలువ గుర్తించలేడు. కట్టు కథలు చదవని బాలుడు, కూడా అంతే. వాటి విలువ బాలి బాలికలకు ఎంతో ఉంది.''

భ్రమలను తనకు తానై సృష్టించుకోవడం సరైనదా? కాదా? భ్రమల ద్వారా ఊహించుకునే ప్రపంచం, జీవితం, మంచిది, శుభప్రదమైనది ఐతే, భ్రమల సృష్టిలో తప్పులేదు అని బ్రియాన్ జములిన్స్కీ అన ఆస్ట్రేలియాకు చెందిన పరిశోధక విద్యార్థి అంటాడు.

హాన్స్ వైహింగర్ (1852-1933) ఒక జర్మన్ తత్వవేత్త. ఇతడు క్రైస్తవ మతాచార్యుల గృహంలో జన్మించాడు. మొదట్లో ఆస్తికుడు, పిమ్మట ప్రకృతికి దైవత్వం ఆరోపించే బహుదేవతా రాధకుడైనాడు. ఆ పిమ్మట నాస్తికుడైనాడు. షోపన్‌హర్ ఆలోచనలకు ఇతడు సన్నిహితుడు (షోఫెనార్ నాస్తికుడు) కాని శాంటాయనా వారె క్రైస్తవ సిద్ధాంతాలలో నైతిక విలువలున్నవని విశ్వసించినవాడు - అతనిదృష్టిలో, మతం అంటే అత్యున్నతనైతిక ప్రవర్తనా నియమ సందోహం.

ఊహాత్మక, శాస్త్రీయ కల్పనా సాహిత్యానికి ప్రయోజనం ఉన్నదని ఆయన అభిప్రాయం.

బార్ట్ కొసాకో, దక్షిణ కాలిఫోర్నియాలోని ఎలక్ట్రికల్ ఇంజనీరింగ్ ప్రొఫెసర్, ఈశ్వరుడ్ని గురించి ఇలా అంటాడు:

''భవిష్యత్ ఊహా ప్రపంచంలో ఈ శ్వరునికి ఒక నిర్దిష్ట స్థానం ఉన్నది. ఆస్థానం మతంలో కాదు, తత్వశాస్త్రంలో కాదు, శాస్త్రీయ కల్పనా సాహిత్యంలో.

మానవ సంస్కృతిరూపొందించిన అత్యున్నత భావన ఈశ్వరుడు. కొందరు ఈశ్వరుడ్ని అనంత శక్తివంతుడుగా ప్రేమ మూర్తిగా, పదార్థ, చలన భావ సముదాయంగా చూస్తారు. స్వేచ్ఛా చింతకులు ఈశ్వరుడ్ని సామాజిక భావనా చిత్రంగా చూస్తారు.

మతం, తత్వశాస్త్రాలలో ఎంతో పరిశోధన జరిగింది. ఐనా ఈశ్వర భావన అంతరించలేదు, బహుశా అంతరించదేమో అంటాడా ఎలెక్ట్రిక్ ఇంజనీర్.

(సెప్టెంబరు 1995 ఎస్క్వైర్ ఆధారంగా చేసిన రచనా శకలాలు)

# కథావస్తువు - కలల ప్రపంచం

''శ్రీ విరించి''

కథలకు వస్తువు నిజజీవితం నుంచే రావాలిగాని కలలు ప్రధానం వహించగూడదు - అనే అభిప్రాయం మనం తరుచు వింటూ వుంటాం. రచయిత తనకు తెలిసి వున్న జీవితాన్ని గురించి వ్రాసినప్పుడే ఆకథలు 'మన్నిక' పొందుతాయి. ఊహాపోహలు ఎక్కువగా రంగరించి వ్రాసినప్పుడు తాత్కాలికంగా చదువుకునేందుకు ఫరవాలేదోమోగాని, ఆ రచనలు సమాజవర్తనానికి ప్రతిబింబంగా తయారుకావు - అనే అనుమానం కూడా కలుగుతుంది.

కథారచనలో వస్తువుకు ప్రాధాన్యం వున్న విషయం సువిదితమే అయినా 'కథనరీతి' కూడా అంతే ప్రధానం. వస్తువు, కథనరీతి (కథనం) ఒక దానికొకటి సమశృతిలో సరళంగా నడిచినప్పుడే రచన కళాత్మకత సంతరించుకుంటుంది.

ప్రతి మనిషీ ఒకరకమైన జీవితానికి అలవాటుపడిపోయివుంటాడు. ఈ జీవన పరిధికి కాస్త అటు - యిటు అయిన ధోరణి అతనికి ముందు కాస్త విడ్డూరంగా కనిపించినా, తగుపాటి ఆలోచనను జోడించ గలిగితే దానిలో అంత 'విపర్యయం' లేదేమో అనిపించవచ్చు. జీవితం మనం ముందుగా అనుకున్న, అంచెనా వేసుకున్న ధోరణిలో కాక, కొత్త చిలువలు - పలువలు తొడగటానికి అవకాశం ఉన్నదని ఊహకు అందుతుంది. పూర్వ పరిచయం లేని 'కల్పన' మనసుకు సహజంగా అనిపించటానికి కొంత సమయ విరామం అవసరం. ఈ విరామంలో అతని ఊహలు, కలలు కాస్తలో కాస్త రంగరింపు అయి జీవితంతో తాదాత్మ్యత పొందుతాయి. నిజానికి ఈ స్థితి యేర్పడటానికి అవసరం అయిన ముడిసరుకు ఆ మొదటి 'కల్పన' లోనే ఉంటుంది.

కథలో ఒక పాత్ర కలకనడం, కథాంతంలో యిది కలేగాని నా జీవితం కాదు గదా - అని ఎఱుక పొందడం వేరే విషయం. కలను మనిషి పూర్తిగా నెట్టివేయడానికి గట్టి ఆధారం ఉంది. అదేమిటంటే, కల అనుభవంలోనికి వస్తున్న సమయం ఎంత పెద్దదయినా ఒక అరగంట కంటె ఎక్కువ ఉండదంటారు, శాస్త్రజ్ఞులు. ఒక్కోమారు అరనిమిషంలోనే కల కరిగిపోయి మెలుకువ రావచ్చును. కల కరిగి పోయిన వెంటనే మెలుకువరాని సందర్భాలు కూడా వుంటాయి. కలలలో మళ్లీ విభాగాలు వున్నాయి - మంచి కలలు, చెడ్డకలలు, పీడకలలు అని. మంచికల మెలుకువ తెప్పించక పోవచ్చును. చెడ్డ - పీడ కలమటుకు మనిషి ధడాలున లేచి కూర్చునేట్లు చేస్తుంది. ఎందుకంటే తనకేదయినా ఆపత్తు, విపత్తు జరుగుతున్నదన్నప్పుడు మనిషికి పూర్తిగా 'జాగరూకత' యేర్పడుతుంది. ఇరవయి నాలుగు గంటల కాలంలో ఒక నిమిషమో, అరనిమిషమో వచ్చే 'కల' సాపేక్షంగా బహుతక్కువ సమయ పరిమితిలో వున్నది గనుక, యిది జీవితం కాదు - అని కొట్టి పారవేయడం జరుగుతుంది. అదేగాక మెలుకువ రాగానే, క్రింది క్షణంవరకు మనస్సులో (సుప్తంగా) మెదిలిన సన్నివేశం, పాత్రలు, వాతావరణం, యిప్పుడు ఎదురుగా రూపుకట్టుకుని కనిపించవు. అందువల్ల యిది తక్షణమే కల్ల (అబద్ధం) అయిపోతుంది.

---

★ ''శ్రీవిరించి'' అసలుపేరు N.C. రామానుజాచార్యులు, ప్రముఖ కథానికా రచయిత, విమర్శకులు. మద్రాసు థియోసాఫికల్ సొసైటీ ప్రచురణ విభాగంలో పనిచేస్తున్నారు.

అసలు 'కల్పన సాహిత్యం' అంతా కలగానే, ఊహగానే కొట్టివేయడానికి కూడా అవకాశం ఉంది. కాని 'సాహిత్యం' అనేది తనను తాను, జీవిత గమనాన్ని పోకడల వివరాలను గమనిస్తూ వుంటుంది. నిరంతరం సమీక్షిస్తూ సాగుతుంది. జీవితాన్నంతటినీ ఒక కలలాగ తనచుట్టూ జరుగుతున్న సంఘటనల పరిపూర్ణ రూపంలాగ సమీకరించుకుంటూ నడుస్తుంది. స్పష్టంగా, సూటిగా, కలలను యధాతధంగా కాకుండా మరింత సునిశితంగా గమనిస్తూ ఆలోచించి అడుగులు వేస్తుంది- జీవితం. దీనిని సాహిత్యపరంగా సమీక్షించుకున్నప్పుడు, తక్షణమే సుఖకరంగా అనిపించే సంఘటనలు, సన్నివేశ నిర్మాణం, పాత్రోచితవైఖరి, వాటి వాతావరణ నేపధ్యం వెంటనే తరుపరి దృష్టిని ఆకట్టుకుంటాయి. వీటికి కళాత్మక దృష్టిజోడించి శాశ్వత విలువలను ఆపాదించే దృక్పధం మనసుకు పట్టటం కొంత ఆలస్యం అవుతుంది. రచన బహుజనామోదం పొందడం ఒక పద్ధతి అయితే, నియమితమైన చదువరులకు మాత్రమే నిరంతర ఆలోచనా రీతులలో మెదిలేట్లు చేయడం మరోపద్ధతి. వ్యవసాయక్షేత్రంలో ఒక గడ్డురాయి తగిలినట్లు అక్కడ ఆలోచన కొంత సేపు ఆగిపోయి, ఆరాతినీ సమతలంతో సల్యశ్రం చేయడం కోసం కొన్ని సాహిత్య ధోరణులు ప్రయత్నం చేస్తాయి. కథనరీతిని బట్టి శైలి యేర్పాటు అవుతుంది. ఇదే మార్పు పొందడంతో ఆగకుండా పాత్రల శీలసంపదను అభివృద్ధి పరుస్తుంది. వాతావరణం కథన రీతిని సన్నివేశాలను కూడా ప్రభావితం చేస్తుంది. వాదనాపటిమ, తర్క అనుసంధానం 'వ్యాసాన్ని' పరిపుష్టం చేసినట్లే సన్నివేశ పరంపర 'కథ'ను ఉత్తేజ పరుస్తుంది. చివరిదాక చదివించుకుంటూ పోతుంది.

కథ సామాజిక జీవనానికి ప్రతిబింబమే కాకుండా సాహిత్య రూపంకూడా. ఊహలు, కల్పనలు యిందులో అతి సహజంగా యిమిడిపోయి వుంటాయి. కథకు రెక్కలు వచ్చినా, ఈ రెక్కల వూపు నిజజీవితానికి ఎక్కువ దూరంలో వుండదు. కొన్ని విషయాలు నొక్కిచెప్పడం అత్యావసరం అయినా, ఈ చెప్పేపద్ధతి కథా గమనంతో అనుశీలనంగా కలిసిపోయి అత్యుక్తులు, అతిశయాలు విన్నవిస్తున్నట్లుగా వుండదు.

కథలలో పాత్రలు మామూలు మనుషులే అయినా వాటి ప్రవర్తన మరింత ఉదాత్తత, విస్తృతి కలిగివుండాలని చదువరి అనుకుంటాడు. నేలమీద నిలబడి ఆలోచిస్తూ వున్నా, ఎక్కడో ఆకాశం నుంచి ఊడిపడ్డట్లు ప్రవర్తించడం కాకుండా, కాస్త మెలుకువగా ప్రపంచంతో సమాంతరంగా నడవడం అవసరం అవుతుంది. పాత్రల ప్రవర్తన తీరు, వాటి బలాలు - బలహీనతలు వస్తువును బలపరుస్తాయి. కథనంలో వచ్చే సన్నివేశాలు, సంఘటనలు విడివిడిగా వేళ్ళాడిపోకుండా ఒకదానితో మరొకటి అనుసంధానం అయివుంటాయి, పునరావృతం కావు. మలుపులు మెరుపులు చదువరికి ముందుగా ఊహించుకున్నవి కాకపోయినా అతడి మానసిక స్థితికి, సామాజిక ఆలోచనకు తగినవిగానే వుండి యిందులో అసంబద్ధత యేమాత్రమూ లేదు - అన్న తృప్తిని యిస్తాయి.

కలలు వేరు, ఊహలువేరు, నిజానికి, 'మనిషిజీవితం' ఊహాశక్తిమీద 'ఆధారపడే' నడుస్తోంది. ఇలా జరిగితే బాగుండును, యిలా జరగకుండా వుంటే బాగుండును - అని అనుక్షణము మనిషి ఊహలు చేస్తాడు. నిజజీవితంలో అయినా, కలలలో అయినా (అంటే జాగరూక స్థితిలోను, స్వప్నా వస్థలోను) ఈ ఊహలు తన ప్రభావాన్ని, జీవితంలో తాము పొందుతున్న ఎదురు

పదాలను అనుసరించి రూపాంతరం పొందుతున్నాయి. చర్యలు, ప్రతి చర్యలు మానసిక వాతావరణంలో 'అతలాకుతలం'గా కలిసిపోయి, మనిషిని గందరగోళ పరుస్తాయి. ఈ విపర్యయంనుంచి తప్పించుకుందుకు - దూరంగా ఉండగలిగేందుకు మనిషి 'వివేకం' సంపాదించుకుంటున్నాడు. ఈ వివేకానికి పునాది కూడా జీవితంలోని అనుభవాలు మటుకేనని మనం మరువకూడదు.

కథలలో చదువరికి అనుదినం అలవాటులో వున్నజీవితమే కనిపించకపోవచ్చును. వస్తువు అతనికి మాత్రము పరిచయం అయినది కాకపోవచ్చును. ఏమనిషీ తనకు జీవితంలో వున్న అన్ని శకలాలూ క్షుణ్ణంగా తెలిసి వున్నాయని అనుకోవడం కుదరదు. మనకు తెలిసిన జీవితం కంటే తెలియనిదే ఎక్కువ భాగం. తెలియనిదానిని తెలుసుకోవటానికి దోహదం చేయడం, 'తెలివిడి' ని అపారం చేయడం సాహిత్యం పని, ఉద్దేశ్యమూను. మనకు ప్రస్తుతం తెలియనిది ఎప్పటికీ తెలియకుండా వుండే అవకాశంలేదు. అవన్నీ మనం ఎప్పటికయినా తెలుసుకోవలసినవే. తెలుసుకునే మార్గం కూడా మనస్సుకు తెలుసును. ఈ మార్గాన్ని సుకరం చేయడం సాహిత్యం చేస్తున్నపని. చదువుతున్న కొద్దీ మనకు అంతవరకు తెలియని విషయాలు ఊహామాత్రంగా మనసులో మెదలడం ప్రారంభిస్తాయి. ఈ ఊహను దృఢతరం చేసుకున్న కొద్దీ జీవితం మరింత తేలికగా అర్థం అవడం మొదలవుతుంది. అంటే ముందు 'కల' లాగ వున్న విషయం కరిగిపోయి జీవితంలో కలిసిపోతున్న దన్నమాట. మనిషికి వున్న ఆశలు, ఆకాంక్షలు..వాటిని పదేపదే కాపాడడం వల్ల క్రమంగా అవి మానసిక వాతావరణంలో మిళితం అయిపోయి జీవితంలోనూ ఒనగూడటానికి ఆస్కారం యేర్పడుతోంది. దీనిని 'కథనం' లో యిమిడినప్పుడు ముందు చూపుకు 'అభూతకల్పన' లాగ కనిపించినా, తరువాత జీవితానికి తొడుక్కున కొత్త చొక్కాలాగ పరిచితం అయిపోతుంది. కొత్త మనిషి కొద్దిపాటి పరిచయం అనంతరం తెలిసినవాడు అయిపోయినట్లుగానే కొత్తరకం కథావస్తువుకూడా సుపరిచిత వాతావరణంలో భాగం అయిపోతుంది. జీవనస్థాయి పెరిగిపోయి., అంతకుముందు కలలు కన్న రేడియో, టి.వి, వార్తాపత్రిక అతిసామాన్యం అయిపోయిన ప్రస్తుత స్థితి గతులలో ఈ రకమైన ఎదుగుదల అసాధారణం యేమీ కాదు. కాకపోతే యిది ప్రధానంగా మానసిక స్థాయినుంచి దిగివచ్చింది గనుక, భౌతికవాతావరణంతో 'మమేకం' అవడాన్ని మనం తొందరగా జీర్ణంచేసుకోలేకపోతున్నాం.

ఒక రకమైన కథావస్తువుకు, ఒకరకమైన పరిమితపాఠకులు మాత్రమే వుండేమాటనిజమే. సమాజంలో అన్ని సముదాయాల స్థితి గతులు అందరికీ కొంతలో కొంత అవగాహన అయిన మీదట, ఈ పరిమితి క్రమంగా విస్తృతి పొంది, అన్ని వస్తువులూ అందరికీ ఆమోద యోగ్యం అవుతాయి. జీవన శైలిలో ఆధునీకరణం వస్తోంది. జనసామాన్యం ఈ ఆధునీకరణకు అలవాటుపడుతున్నారు. ఈ ఆధునీకరణ సాహిత్యంలోని కథావస్తువులో వస్తున్నప్పుడు, ముందు యిది మనస్సులకు ఎక్కడం కొంచెం కష్టం అయినా క్రమ పరిణామం వల్ల పరిమితులు, హద్దులు బద్దలుకొట్టుకుంటాయి. ఎల్లలు లేని కథావస్తువు ఎల్లవారికే ఎఱుక అవుతుంది.

కథావస్తువులో ప్రధానంగా కనిపించే వైవిధ్యాలు:
ప్రేమ-శృంగారం
గృహవాతావరణం-గ్రహింపులలో అవరోధాలు
ప్రవర్తనతీరులు, పరిణామ ప్రక్రియలు
మారుతున్న ధోరణులు
మౌలిక విలువల కోసం వెదుకులాట.

జీవన వికాసం కోసం శ్రమలు, పరిశ్రమలు మానవసమాజాన్ని మనుషుల్ని ఎక్కువగా పీడించుకు తింటూ, కథలలో తరుచు బాహాటంగా కనిపించే ఆకలి - నిరుద్యోగం - నిరుపేదతనం - శ్రమదోపిడి - పైకి రావడం కోసం పోటీ మనోభావం - వ్యక్తిగత కాంక్షలు... యిలాంటి లక్షణాలతో సమ్మిశ్రం అయిన సమస్యలన్నీ పై 'వైవిధ్యాల' లో అంతర్భాగాలుగా యిమిడిపోతాయి. కథావస్తువు రాజులనుంచి, భూస్వాములనుంచి మారిపోయి సామాన్య సంసారుల యింటి గోడల మధ్యకు వచ్చింది. అలాగే సామాన్య సంసారుల యింటిని పెంచుకుంటూ 'అసామాన్య' వస్తువులను, ఆలోచనా తీరులను వ్యక్తపరుస్తోంది. మనస్సును అనవరతము కలిపివేసుకుంటూ, వివేకాన్ని పెంపొందించుకుంటూ పరిపూర్ణతవైపు ప్రయాణం చేస్తోంది. జీవితాన్ని చూచి, గమనించి, తూచి, సజావుగా సంపూర్ణం చేసుకోవటానికి ప్రాతిపదికగా వుండే వస్తువులను, మనిషియిప్పుడు తన 'స్వంతం' చేసుకోగలుగుతున్నాడు. కథ పరిణామం, వస్తుసంపదవైవిధ్యంగా విస్తరిస్తూ, విభిన్నతను కళ్లకు కట్టినట్లు చూపిస్తూనే యేమాత్రం విభజన ఎరగని ' ఏకత' వైపు చురుకుగా చాకచక్యంగా అడుగులు వేస్తోంది. దీనిని జాగ్రత్తగా పరిపోషించుకోవడం అవసరం.

జీవితంలోని శాశ్వత విలువలు-వాటి మానవత మనుగడల పునాదులు- ఎత్తిచూపే కథల ప్రమేయం యిప్పుడు ఎంతయినా వుంది. అలాంటి కథలకే సాహిత్యంలో నిలదొక్కుకోగల శక్తి **(Staying Power)** సమకూడుతుంది. దురదృష్టవశాత్తు, శాశ్వత విలువలు, ఎక్కువ విలువయిన విలువలు అని మనం అనుకుంటున్నవి చాలామటుకు అదృశ్యరూపంలోనే ఉండిపోతాయి. కొట్టవచ్చినట్లుగా కనిపించవు, సూచన ప్రాయంగానే వుంటాయి. వాటినిగురించి మనిషి అవగాహన చేసుకునే ప్రక్రియలో ఊహలు, కలలు యేర్పడుతున్నాయి. తాను అనుకున్న దానిని ఎలాగయినా సంపాదించి యిప్పటికి నా ఈపంతం నెరవేరింది అనుకోవడంలో మనిషికి ఎంతోతృప్తి వుంది. ఈప్సితం మనిషిని తరువాతి మెట్టుకు తీసుకు వెడుతుంది. అలా జీవితం అంచలంచలుగా ముందుకు సాగిపోతుంది.

రచయిత సాంఘిక, సామాజికి దర్శకుడు. ఒకరకంగా నిర్వాహకడు కూడా. చూడడమే కాకుండా, చూస్తున్న దానిని మరింత ఆనందదాయకంగా రూపొందించి, ప్రదర్శించడం అతడు చాకచక్యంగా చేస్తాడు. తన సమాజం 'సమున్నతం'గా కనిపించటానికి యేరకమైన మార్పులు, చేర్పులు అవసరమో తన రచనల ద్వారా సూచించడమూ వాటి అనుగుణశీలతను సుసాధ్యం అనిపించేట్లు చేయడమూ అతడి బాధ్యత. దీనిని నినాదాలు-వివాదాలు అవసరం లేకుండా నిదానంగా ఆలోచనలను ప్రేరేపించడం ద్వారా చేయవచ్చును. సమాజాన్ని శాసించడం ఏ ఒక్క సముదాయం తన ప్రత్యేక హక్కుగా తీసుకోవడానికి కుదరదు. ఎన్నో సముదాయాలు సమరసంగా

వ్యవహరించి ఒకదాని పనిని మరొకటి ముందుకు వెళ్లేట్లు చేయడం వల్లనే సమాజం, దాని చేతనావస్థ పైపైకి వెడతాయి. ఒకరు చేసిన పనిని మరొకరు 'దిగలాగడం', కుదించడం వల్ల యీ పని కుంటు పడుతుంది. ఎక్కడ వేసిన 'గొంగళి' అక్కడే వుండడం జరుగుతుంది.

రచయితకు తాను చెప్పదలుచుకున్న విషయం మీద పట్టు, విధానం మీద ఆకళింపు వున్నప్పుడు-నేలవిడిచి సాము చేయకుండా వున్నప్పుడు-నేలబారు రచనలు కాకుండా అందరి హృదయాలను హత్తుకోగల తీరు అలవడతుంది. అప్పుడు భౌగోళికంగా, చారిత్రకంగా పరిమితమైన విషయాలను కథలలో చొప్పించినప్పుడు కూడా మానవతా విలువలను ఎత్తి చూపటానికి ప్రయత్నం చేస్తాడు; మనస్సులను ఆకట్టుకోగలుగుతాడు.

కలలు రాకుండా వుండడం అనారోగ్యకారణం అంటారు, కొందరు మానసిక శాస్త్రవేత్తలు. కలలు కనడం, మానవ జీవితంలో అతిసహజమైన ప్రక్రియ, పరిణామం. ' ఆహా! నాకలలు పండాయి, నాకు ధన్యత చేకూరింది' అని ప్రతిమనిషీ ఆనందంగా చెప్పుకోగల తరుణం కోసం ఎదురు చూస్తూ వుంటాడు. కలలు నిజం చేసుకోవడం. ఆనిజాన్ని సాహిత్యంతో రంగరించుకు ముందుకు వెళ్లడం మానవుడి ప్రగతికి ఎప్పుడూ ఉదాహరణంగానే నిలచిపోతుంది. గొప్పగొప్ప కలలుకని వాటిని యధార్థంచేసుకోవడం మన జన్మహక్కు. జీవితాన్ని రూపొందించుకోవడం మనచేతిలోనే, చేతుల్లోనే వున్నదనుకున్నప్పుడు దాన్ని సుందరస్వప్నంగా తయారు చేసుకుందాం అనుకోవడంలో కానిదేమీకాదు, కినుక వహించవలసిందీ లేదు.

మానవ జీవితంలో కలలకు స్థానం ఉన్నట్లే అతను నిర్మించుకుంటున్న నమూనాలలో కలలకు కూడా చోటు వుంటుంది. కలలను సాహిత్యదర్పణంలో ఎదురుగా చూచుకుని, తద్వారా పరిణామము, పరిణతి పొందుతూ మనిషి క్రమంగా 'స్వప్రజ్ఞ' లో సుస్థితుడు అవుతాడు (Self Actualization). ఒక కల కనడానికి, దాని పూర్వరూపం జీవితంలో ఎక్కడో ఒక చోట తారసపడివుంటుంది.

కథలలో పాత్రలతో ప్రారంభించి ఈ Self Actualization ప్రక్రియను పరిచయం చేసుకుంటూ పోయి చదువరులందరినీ మరింత 'నిపుణమతులు' చేయడం కథాసాహిత్యానికి సాధ్యమైనపని. వస్తునిర్మాణం తగినంత విస్తృతినిపెంపొందించుకోవడం యిందుకు తప్పనిసరి. ఈ రకమైన కృషి ఎన్నో స్థాయిలలో ఎంతో విశేషంగా జరిగింది గనుకనే మనం యీ రోజున భవిష్యత్తులో కథానికస్వరూపం ఎలావుంటుంది - అని ఆలోచించుకోగలుగుతున్నాం. ఎక్కడ వేసిన గొంగళి అక్కడే వుండిపోదు. చలనశీలత ప్రపంచంలోని అన్ని వస్తువులకూ వున్నట్లే, మనిషిలోని మనస్సుకు అతను సృష్టించుకుంటూ పోతున్న సాహిత్య ప్రక్రియలకూ విధాయకంగా వుండితీరుతుంది.

మానవసమాజం అత్యంతపరిణామ శీలతను ఆశ్రయించి మన ఊహలకు అందనంతగా ఎదిగిపోతుందనుకోవడం కూడా కొందరి దృష్టిలో 'కల' మాదిరే అనిపించవచ్చు. కాని ఈ కలను నిజంచేసుకునే సామర్థ్యం జనసామాన్యానికి వుంది. అలానిజమైన కలల్లోనే జనావళి ఎప్పటికప్పుడు ముందుకు ప్రయాణం చేస్తోంది. ఈప్రయాణానికి కథాసాహిత్యం తన చేతనయినంత సహాయం చేస్తూంది.

# జిడ్డు కృష్ణమూర్తి దర్శనం.

- కె.యమ్.రాయుడు

ప్రేమ లేకపోతే జీవితం చాలా నిష్ఫలంగా ఉంటుంది. చెట్లూ, పక్షులూ, స్త్రీలూ, పురుషులూ, పిల్లలూ, చిరునవ్వులూ, నేలా, ఆకాశం, జంతువులూ, నదులూ, సంబంధాలూ, సూర్యోదయాలూ, సూర్యాస్తమయాలూ మొదలయిన వాటికి అర్థమే లేదు. ప్రేమలేని జీవితం లోతులేని నీటిమడుగు లాంటిది. మన హృదయాల్లో ఈ ప్రేమభావం లేనంతకాలం ఏ సమాజం సంఘర్షణ నుండి, దుర్భర వేదననుండి విముక్తిని సాధించలేదు.

జిడ్డు కృష్ణమూర్తి బోధనలకు ఈ ప్రేమ భావనే కేంద్రం. సత్యమని చెప్పినా, కాలాతీత జ్ఞానమన్నా, మోక్షమన్నా, ఆనందమన్నా, దైవమన్నా అదే. వ్యక్తి ఈ దర్శనాన్ని పొందటానికి అన్ని రకాల అడ్డంకుల్ని తొలగించేందుకు తను అందించిన జ్ఞానాన్ని తత్త్వశాస్త్రంగా ఆయన అంగీకరించరు.

1895, మే 12న మదనపల్లిలో పుట్టారనీ, భారతీయుడే కాక ఆంధ్రుడని, 1986 ఫిబ్రవరి 17న చనిపోయారని చెప్పుకోవడం కృష్ణమూర్తి జీవిత దర్శనాన్ని కుదించటమే. తన జీవిత దర్శనాన్ని ఎవరైనా వ్యాఖ్యానం చేయటం ఆయనకు ఏమాత్రం ఇష్టంలేదు.

పేదరికం, ద్వేషం, హింస, పోటీ, అసూయ, యుద్ధాలూ లేని ఒక నూతన ప్రపంచాన్ని నిర్మించేందుకు ప్రస్తుత విద్యావిధానాన్ని మార్చాల్సిన అవసరాన్ని గుర్తించి ప్రపంచ దేశాల్లో ఎన్నో స్కూళ్ళల్లో, కాలేజీలలో, యూనివర్శిటీలలో, బయటా యాభై ఏళ్ళకుపైగా అసంఖ్యాకమైన ప్రసంగాలు చేశారు కృష్ణమూర్తి.

పిల్లలు నిజంగా దేనిని ప్రేమతో చేయగలరో తెలుసుకోవడంలో సహాయపడటమే విద్య ప్రధాన కర్తవ్యం. అది ఎంతో అవసరం కూడా అంటారు జిడ్డు కృష్ణమూర్తి. అప్పుడు పిల్లలతోపాటు ప్రేమ కూడా ఎదుగుతుంది. ఆ ప్రేమే చేసే ప్రతి పనిలోనూ వ్యక్తమవుతుంది. అది లేకుండా పరీక్షలు రాయటమో, పుస్తక జ్ఞానాన్ని సంపాదించుకోవటమో, శక్తిసామర్థ్యాలు పెంచుకోవటమో, పదవినో, ఆస్తినో సాధించుకోవటం మొదలయినవన్నీ బూడిదతో సమానమంటారు కృష్ణమూర్తి.

దేశసంస్కృతీ, సంప్రదాయాలూ, క్రమశిక్షణ పేరున పిల్లల చొరవను నాశనం చేస్తున్నాయి. ఇది చెయ్, అది చెయ్ అని పదే పదే చెప్పి గట్టి క్రమశిక్షణ కింద పిల్లల మనసుల్ని చదును చేస్తున్నాయి. రోడ్డురోలరు కింద రోడ్డు చదునయినట్టు స్వతంత్ర వ్యక్తిత్వానికి చోటే లేదు. సంఘమనే యంత్రంలో వారిని ఒక భాగంగా చేస్తున్నాం. అందుకే వారు తిరగబడరు. భగ్గుమని పేలరు. ఈ చట్రాన్ని తెంచుకొని బయటపడరు. 'తిరగబడటం తల్లిదండ్రులకు ఇష్టంలేదు. తెంచుకొని బయటపడటం ఉపాధ్యాయులకు ఇష్టంలేదు' అని తెలియజేస్తారు కృష్ణమూర్తి.

ఏ స్థాయిలోనైనా విద్యాబోధన ఒక వృత్తి కాదంటారు కృష్ణమూర్తి. తాము కోరుకున్న వృత్తి కాబట్టి దానిపై ప్రేమ ఉంది కాబట్టి అది కేవలం కూలికోసం చేసే పని కాదు. అది ఒకదానికి అంకితం కావడం. అంటే దేనికో ఒక దానికి బదులు కోరకుండా తన్నుతాను సమర్పించుకోవడం - ఒక తపస్విలాగో, గొప్ప విజ్ఞానవేత్తలాగో అని.

తల్లిదండ్రులూ, వారి నమ్మకాలు, జీవిస్తున్న సంఘం, సాంఘిక, రాజకీయ నేపథ్యం, తినే ఆహారం, చుట్టూ ఉండే మతం, పాటించే సంప్రదాయాలు, బీద, ధనిక వ్యత్యాసాలు ఇవన్నీ కలిసి పరిసరాలు అవుతాయి. ఈ పరిసరాలపై ఎదురు తిరిగి ప్రశ్నించి వాటిపై తిరగబడితే వాటిని

ఛేదించుకొని బయటపడితే ఆ ప్రయత్నమే ముందు ముందు నిజమైన శాంతిని చూపగలుగుతుంది. ఇది ప్రస్తుతం మనం పొందుతున్న మృత్యుశాంతికి, జీవనంలేని శాంతికి భిన్నమయింది. కాబట్టి శాంతికాదు ముఖ్యం - పరిసరాల్ని అర్థం చేసుకొని వాటిని బద్దలు కొట్టుకొని బయటికి రావడం ముఖ్యం అని అంటారు కృష్ణమూర్తి.

లోలోపల మనం వొట్టి అనామకులం. మనలో అంతరంగిక సంపదేది లేదు. ఒంటరిగా, స్వతంత్రంగా నిలబడగలిగే ఆత్మ సౌందర్యంలేదు. అందువల్ల బయట ప్రపంచంలో పేరుకోసం ప్రాకులాడుతాం. అట్లాకాక ఆత్మసౌందర్యం ఉన్నట్లయితే బయటి ప్రపంచంలో పేరున్నా, లేకపోయినా ఒకటే అని ఆయన భావన.

అలెగ్జాండరు భారతదేశాన్ని జయించిన తరువాత ఓ రాజ్యంలో మంచి వ్యవస్థను ఏర్పాటుచేసి ప్రజలలో నిజాయితీని పెంపొందించి, అవినీతికి ఏమాత్రం అవకాశం లేకుండా పాలించిన ఓ ప్రధాన వ్యక్తిని చూడాలనుకొన్నాడట. అతడు తన గ్రామానికి వెళ్ళిపోయాడని చెప్పగా తనకు అతన్ని చూడాలనిపిస్తోంది - పిలిపించమని అలెగ్జాండరు కబురు పంపాడట. అయితే అతను రావడానికి ఇష్టపడలేదు. దానికి కారణం పదిమంది ఎదుట తాను గొప్పవాడుగా నిలబడి పొగడ్తలందుకోవడం ఇష్టంలేదు. దురదృష్టవశాత్తు మనం ఇలాంటి స్వభావాన్ని పోగట్టుకొంటున్నాం అని గుర్తు చేస్తారు కృష్ణమూర్తి.

నిజమయిన మతమంటే స్తోత్రాలు చేయటంలో లేదు. మరే ఇతర కర్మకాండలోనూ లేదు. దేవుళ్ళనో, రాతి విగ్రహాలనో ఆరాధించటంలో లేదు. బైబిల్నో, భగవద్గీతనో, ఖురాన్నో చదవటంలో లేదు. ఇదేది నిజమైన మతం కాదంటారు కృష్ణమూర్తి.

మనసు విగ్రహం మీద నమ్మకం పెంచుకొన్నట్లయితే ఆ విగ్రహం మనసుకు శక్తిని ఇస్తుంది. అందులో సందేహంలేదు. మనసు విగ్రహాన్ని సృష్టిస్తుంది. తాను సృష్టించిన విగ్రహాన్నుండి తిరిగి మనసు శక్తిని పొందుతూ ఉంటుంది. అంటే తాను సృష్టించిన వాటినుండి తిరిగి బలాన్ని, సుఖాన్ని, ఏదైనా ప్రయోజనాన్ని పొందగలుగుతూ ఉంటుంది. అయితే ఈ పని అంతః శూన్యతతో, అంతరంగిక దారిద్ర్యంతో ఉన్న మనసే నిరంతరం చేస్తూ ఉంటుంది అని కృష్ణమూర్తి తెలియజేస్తారు.

మతం మార్పిడులు వద్దు. మార్చడమంటే చెరసాల నాలుగు గోడల మధ్యనే తిరుగుబాటు చేయడం. దాని బదులు చెరసాల గోడలను బద్దలు కొట్టి బయటికి వచ్చి దైవమంటే ఏమిటో సత్యమంటే ఏమిటో తెలుసుకోవాలి. అప్పుడే దానికి అర్థముంటుంది. అంతేకాని కేవలం ఒక చెరసాల నుండి మరొక చెరసాలకు పోవడం ఏ చెరసాల మంచిదో అని పోట్లాడుకోవడం - చిన్న పిల్లల చేష్టగా అభివర్ణిస్తారు కృష్ణమూర్తి.

సత్యాన్వేషణే నిజమైన మతం. ఎవరైనా ఒక మనిషి నిజంగా దైవాన్ని అన్వేషిస్తూ ఉంటే అతడు గుడుల వైపు పోడు. గుడి, మసీదు, చర్చి - ఇవన్నీ మనుష్యుల్ని విభజిస్తాయని గుర్తిస్తాడు. దైవాన్ని అన్వేషించే వాడికి ఇవేవి అక్కర లేదంటారు కృష్ణమూర్తి. మతం కాని దేదో ఒకసారి తెలుసుకోగలిగితే ఇక జీవితంలో పూజారులు కానీ, పురోహితులుకానీ వంచించలేరు. ఎలాంటి భయాన్ని, భ్రాంతిని మనలో పుట్టించి గుడ్డిగా అనుసరించేటట్టు చేయలేరంటారు. మతం కానిదేదో తెలుసుకోవడం కోసం మొదట మనం ప్రతిదినం చేసే పనుల్ని అర్థం చేసుకోవటంతోనే ప్రారంభించాలి. దూరం పోవాల్సిన వాడు దగ్గరలో ఆరంభించాలి కదా అని అంటారాయన.

జాతీయభావం ఒక బూటక దైవం; ఒక భ్రమ. కాని లక్షల కొలది ప్రజలు దీనిని ఒక గంభీరమయిన విషయంగా పరిగణించి ఒకరినొకరు నాశనం చేసుకొంటారు. రాజకీయ స్వార్థానికి బలైపోతుంటారు అని తెలియజేస్తారు.

రోజురోజుకూ పెరుగుతున్న సంక్షోభాలతో, సమస్యలతో నిండిన ఈ ప్రపంచంలో ఒక నూతనమైన నీతి, నడవడిక - వీటితోపాటు జీవిత విధానాన్నంతా ఆకళింపు చేసుకోవడంలో నుండి పుట్టుకొచ్చే ఒక కార్యాచరణ తక్షణం అవసరమంటారు కృష్ణమూర్తి. సంస్కరణలేవీ ఈ సమస్యల్ని పరిష్కరించలేవు. అవి ఎంత విస్తృతమైనవి అయినా - చిరకాలం నిలిచిపోయేవిగా కనిపించినా తిరిగి మరికొంత అల్లకల్లోలం సృష్టించి మరికొన్ని సంస్కరణలు చేయాల్సిన అవసరాన్ని కలిగిస్తాయి. సంక్లిష్టమైన మానవ స్వభావాన్ని గురించి అవగాహన చేసుకోకుండా సంస్కరణలు జరిపితే ఫలితం ఇదే అని అంటారు. అలాగే ఆర్థిక, రాజకీయ, సామాజిక విప్లవాలు కూడా ఈ సమస్యలకు సమాధానం కావు. ఎందుకంటే ఇవి భయంకరమైన నిరంకుశ పాలనకు దారి తీస్తాయి లేదా అధికారం, ఆధిపత్యం కేవలం వేరొక కూటమికి బదలాయింపు చేయడాన్ని మాత్రమే సాధిస్తాయి అని సూచిస్తారు జిడ్డు కృష్ణమూర్తి.

మీ రెంత ప్రయత్నించినా ఘర్షణ లేకుండా సమగ్రత రాదు. ఘర్షణ ద్వారా, ఆ ఘర్షణను అర్థం చేసుకోవడం ద్వారానే సమగ్రత లభిస్తుందంటారు. అందుకు దైనందిన కార్యకలాపాల్లో జీవించే పైపై మనస్తత్వం నుండే సంపూర్ణ శక్తి సామర్థ్యాల్ని జాగృతం చేసుకోవాలి. అంటే అజ్ఞాతంగా ఉన్న మనసును కూడా అవగాహనచేసుకోవాలి. అజ్ఞాత మనసును అర్థం చేసుకోవడంలో సర్వసమగ్ర జీవితం ఉంటుంది. అప్పుడే ఒకదాని వెంట మరొకటి వరుసగా వచ్చే సుఖాలు, దుఃఖాలతో కూడుకొన్న పరస్పరవైరుధ్యం మాయమవుతుంది. మనసు ఉపరితలాన్ని, అజ్ఞాతాన్ని అవగాహన చేసుకొన్నప్పుడే అది తన పరిమితులను అధిగమించి ఆవలగా వెళ్ళి కాలంతో సంబంధం లేని ఆనందాన్ని కనిపెట్టగలుగుతుందని అంటారాయన.

ఈ ఆనందాన్ని లేదా ప్రేమ భావాన్ని పొందటం ఎవరికి వారే తప్ప సంస్కర్తలూ, రాజకీయ నాయకులూ, గురువులూ, మతాధిపతులూ, పీఠాధిపతులూ, మార్గదర్శకులు కారు అని స్పష్టం చేస్తారు కృష్ణమూర్తి. అలాగే తననూ గురువుగా భావించటాన్ని సహితం అంగీకరించరు.

శిష్యుడు ఓరోజు ఉదయాన్నే గురువు బోధకోసం ఎంతో శ్రద్ధతో వినడానికి కూచున్నాడు. ఇంతలో ప్రక్కన చెట్టుమీద పక్షి అరవటం ప్రారంభించింది. కాసేపయ్యాక ఈ రోజు బోధ ముగిసిందని లేచాడు గురువు. శిష్యుడికి వెంటనే అర్థం కాలేదు - బోధ మొదలు కాకుండా గురువు ముగిసిందని లేవడమేమిటా అని. బోధ గ్రహించడాన్ని గురించి ఆయన ఎప్పుడో చెప్పిన ఈ కథకు మించి ఎక్కువగా చెప్పుకోవాల్సిన అవసరంలేదు.

ఎంతో మహోన్నతమయినదయినా, కాకపోయినా నేర్చుకోవడానికి, గ్రహించడానికి మన మనస్సులో ఖాళీస్థలం ఉండాలంటారు కృష్ణమూర్తి.

ఖాళీస్థలం లేదా ఎడమంటే తెలుసా? గదిలో ఖాళీస్థలం ఉంటుంది. అలాగే ఈ గట్టుకు ఆ గట్టుకు మధ్య ఖాళీస్థలం ఉంటుంది. కిక్కిరిసిన ఆలోచనలు లేకపోతే మన మనస్సులోనూ తప్పక ఖాళీస్థలం ఉంటుంది. ఆలోచనల మధ్యనేకాదు ఆలోచనల బయట కూడా అందులో నిశ్శబ్దత ఉంటుంది. అటువంటి నిశ్శబ్దతలోనే సరిగా వినగలరు; చూడగలరు, గ్రహించగలరు అంటారు కృష్ణమూర్తి. ఏమి ఆలోచించాలో నేర్పుతున్న నేటి తాత్త్విక ప్రపంచంలో ఎలా వినాలో, ఎలా చూడాలో వివరించటానికే కాక ఎలా ఆలోచించాలో బోధించటానికి అత్యధిక ప్రాధాన్యం ఇచ్చిన ఏకైక వ్యక్తి జిడ్డు కృష్ణమూర్తి అనిపిస్తుంది.



*Ms Hillary Clinton looks at a golden Buddha statue at the Doi Suthep Temple in Chiang Mai, Thailand.*

MISIMI/మిసిమి RNI Regd. No. 45042/90 Telugu Monthly, Hyderabad-500 020. Postal Regd. No. H/SD/191.



Naguib Mahfouz

*"who, through works in nuance—now clear-sightedly realistic, now evocatively ambiguous—has formed an Arabian narrative art that applies to all mankind"*

1988 Nobel Prize in Literature